ఓమ్

సచ్చిదానందగురు పరబ్రహ్మణేనమః

—:*:—

భక్తిజ్ఞానానందంబగు

# తారకామృతసారము

ఈ వేదాంత గ్రంథము

ముముక్షుజనోపయుక్తంబగునటుల

ధవళేశ్వర పురనివాసులు

గంగగోత్రం - సూర్యవంశజాతుండు

గుజ్జుల - నారాయణదాసుగారిచే

రచియింపఁబడి

కాటఁపేట కాపురస్థుడు

బోర-సింహాన్న దాసుగారి జ్యేష్ఠపుత్రుండు

బోర - అప్పలస్వామిగారి

[illegible]సాహాయమువలన



[illegible]కిష్టులు


## కొండా శంకరయ్య

సికింద్రాబాద్, హైదరాబాద్, & వరంగల్.

దీనివెల] 1955 [0-12-0



గుజ్జుల-నారాయణదాసు పీర్-మొహిడీన్ సాహేబు బోర-అప్పలస్వామి

శ్రీరస్తు

# విషయసూచిక

—:*:—

| విషయములు | పుటసంఖ్య |
| --- | --- |

విషయములు



విషయసూచిక సంపూర్ణము

---

శ్రీరస్తు

శ్రీ గురుభ్యో నమః

శ్రీ మతే నారాయణ మః

# తారకామృతసారము



క. శ్రీగణనాథుని నెప్పుడు ♦ బాగుగ మదిలోన భజన జేయుచునుంటే
రాగద్వేషములెల్లను ♦ వేగముగను పూడి ధరలో ధలధలరాలున్॥

క. తలతును శ్రీజగదాంబను ♦ తలతును శివవిష్ణుబ్రహ్మ రుద్రులనెల్లన్
దలతును ఋషిగణములకును తలతును♦తలిదండ్రి ఆదిదైవములకునూ॥

క. వందనమంటిని గురువర ♦ దండలు దీర్చేటిఘాటి దొరనీవగురా
యొందున తిరుగకుమని నా♦మందిరమందుండే మహాత్తుదెల్పితిగురుడా॥

క. నిత్యానందముకంటే ♦ అ ♦ సత్యానందంబులన్ని సతసంబగునా
ప్రత్యేకము గురువర్యులు ♦ సత్యస్వరూపమునకు సన్నుతిజేతుర్॥

క. నిజముకునిష్ఠూరమురా ♦ సుజనులజిక్కు కుజనులకు చిక్కదురా
భజన జేసేవిధ ♦ అజపాగాయత్రిమంత్ర మెరిగితెసరిరా॥

క. దుష్టగుణంబులు నెల్లను ♦ అష్టమదంబులనుబట్టి అణచెడివిధమున్
కష్టములేకుండగనూ ♦ సృష్టిలో కనకయ్యగురుని చేతదొలంగన్॥

క. ధాత్రిలోపల శ్రీరంగా ౹ క్షేత్రము సూర్యోదయాఖ్యునకు జనకునకున్
మాతయు లక్ష్మీదేవికి ౹ సూతుండై ప్రుట్టితిని సూత్యవంశం॥

క. నారాయణదాసుడు హరి ౹ పారాయణ జేయుచుండె పరమార్థముకై
తారక అమృతసారము ౹ కూరిమితో జెప్పిరిపుడు శ్రీహరి కృపచే॥

## గ ణ ప తి స్తో త్ర ము

### ౧. కీర్తన - రాగము - యదుకులకాంభోజి - అటతాళము

గణపతి గణపతె గణపతినీ అతివినయములోనే మ్రొక్కితి నీమన
మున నెప్పుడు మరువక అనుదినయును ఆరోండలు పూజలునల్పుచు॥ గ॥

పార్వతీ తనయుడనని నేనునిను పరిపరివిధములు వేడెదనూ
యూర్విలోన యున్నదంతవరకు నీ పాదాక్షరములు పానముచేసితి॥ గ॥

ముందుపూజలు నీకేగదా సురమునులు కిన్నరులు జేసెగదా
చందన పరిమళ సుగంధన వాసనలెల్ల మేనుకు అలంకరించిన॥ గ॥

వంకరతొండము వాడవురా నా సంకటములు తెగగోయుమురా
శంకలేక నీచెంత జేరితే యమకింకరులకు సేవకము కానని॥ గ॥

ఎలుకవాహానా రూఢుడై యెల్లలోకములకు నీవు పూజ్యుండై
నిలుకడలేకను యింటయింటను కొలిచినవారికి కోర్కెలొసగితివి॥ గ॥

యేకదంతము గణనాథా నన్నేలుమి శ్రీవల్లభనాథా,
ప్రాకటముగ ఈ లోకములోనిను ప్రార్థనచేయుచు పూజలుజేతురు॥ గ॥

గుజ్జువేల్పువని పొగడెదనూ గుజ్జుల నారాయణదాసుడనూ
మజ్జనభోజన ఫలహారంబు బొజ్జనిండ భుజించిన వేల్పని గ॥

## అ ం బ స్తో త్ర ము

### ౨. కీర్తన - రాగము - కాంభోజి - ఆటతాళము

జననీ జగజ్జాలములో నుంటి శారదగీర్వాణీ॥

జనని జననీ నాదుమనవి వినియువినక యుంటివేమో కనికరాము
నీకు లేదా కంజదళాక్షి తనయుల సంరక్షణ జేసెటితల్లి కర్తయాని
మనమునా నెప్పుడు నిన్ను దలచితీ పల్లవపాణీ॥ జననీ॥

ముగ్గురుమూర్తులుగన్న ముక్తికాంతనీవెయని భక్తితోడ వేడితి
నాభావమందునా యుక్తిచేత నీవు నన్నుముక్తికి దాటింతువని శక్తి
కొలదిగ సేవజేతు పద్మజరాణి॥ జననీ॥

పిల్లలు బల్కిన బల్కులు తల్లులెట్లానందించిరో అల్లనే జెప్పిన
మాటలన్ని నీవట్లూచల్లని నీకృప వెదజల్లుచునుంటేనుచాలు తొల్లి చేసే
కర్మములు ద్రుల్లును కాత్యాయనీ॥ జననీ॥

పుట్టినప్పటినుంచి ఏ పుణ్యము నేనెరుగనైతి పుట్టెడు పాపములు వడిగట్టుకుంటినీ పొట్టకొరకు నేను భూమిలోకష్టపడి భ్రష్టయితీ సృష్టికర్త వాని నెఱుంగలేక మట్టిలో మట్టయితినమ్మా॥ జననీ॥

తప్పులొప్పులున్నగాని వొప్పుకుండె మాతానని చెప్పుకొంటినేను నీవు చెవులకింపుగా తప్పక నారాయణదాసుని తక్షణంబె నీవు ముప్పు చేయకుండగాను గొప్పపడవి కప్పజెప్పు॥ జననీ॥

3. కీర్తన – రాగము – ఫరజు – ఆదితాళము

రామా రాఘవ దేవా జూపవేమిర త్రోవ మోము జూపుమి రాఘవా రామరాఘవని వేడినందుకు వేగదయజూడ వెందుకు నీ మహాత్మ్యము దెలియుటకు నేనెంత వాడను దంతిరక్షక॥ రామ॥

యింటి వేలుపనుకొంటి మదిలోముక్కంటి వరములిమ్మంటి అంటి అంటక యుండుమిా నీకంటితో ననుజూడుమిా సంకటము లేకుండగాను నీబంటువలె భావించుకొమ్మా॥ రామ॥

గరుడగమన రారా ఘనమున నేలరా మురహరి దయజూడరా శరణు శరణని అన్నవారికి కరుణతో కాపాడెదావని వెరపులేకను కంకణము నీశిరమున ధరియించితివి॥ రామ॥

పాపకర్ముడనానీ కోపగించకుస్వామిా ప్రాపుచేరితినుమిా్మ తేప తేపకు వేడినందుకు తాపసుల మున్నేలినావట ఆ ప్రకారము నేలుటకు మదితోచదేమో తెలియదాయను॥ రామ॥

ఆనందముగాను నీపాదాక్షరములాకు పొందుగాపూజించే నాబంధుజనములు సతియుసుతులుహితలు యందరు యున్నగాని పొందుగోరిన వారికెప్పుడు ముందుమార్గము జూపవలెనట॥ రామ॥

పసివాడను నేను కనుగాయ సమమాను శశిధర నీకన్ననూ వసుధలెవ్వరు లేరని రణభేరివేసి సాటెదాను పశుపతీ నారాయణుని నేలు మిా ప్రఖ్యాతిగాను॥ రామ॥

౪. కీర్తన – రాగము – నాదనామక్రియ – ఆదితాళము

రామ రాఘవా రక్షించుమి దేవా రామరాఘవా॥

రామ రామ శ్రీరామరాఘవా వేమారునిను వేడితె ననుబ్రోవర మోముజూప మురహరి యిటురారా నీమహాత్మ్యమెరుగలేను దేవా సోమసూర్యప్రకాశ సుందరిటురావా నేపామరుడానని రాక పంతముం చేవా భీమపరాక్రమ ధామ సద్గుణస్తోమా జగదభిరామ దరికిజేర్చుము నీ వాడను సుమ్మా నేతాళలేను యిటురమ్మా పసిబాలుని బ్రోవను

సుమ్మా యికజాలమేమి సేయుకూ శ్రీలలనాథుడ శీఘ్రమేల నన్నునేలు
కొనుము కరుణాలవాలహరీ॥ రామ॥

తండ్రిమాట జవదాటలేక తక్షణమే దండకారణ్యమున కోదండమునకు సంబంధించి బాణములు ఖండించుచు ఖరదూషణాదులను మెండుగాను వాలిని బడగొట్టితివివన్నా సుగ్రీవుని కిష్కింధపురికి రాజు చేసితివన్నా కొండలుగిరులు వారణాసి లేసికట్టి వారధిదాటి రావణు సుతులు కుంభకర్ణాదుల ద్రుంచితివన్నా లంకాపురి పట్టంబన్నా విభీషణునికి సుమ్మనన్నా పట్టంబు గట్టితివన్నా శంకలేక సీతాలక్ష్మణ సమేతుడవై అయోధ్యకేగినా॥ రామ॥

ధిక్కరించి హిరణ్యకశిపుడు దుఃఖముతో ప్రహ్లాదుని చూచి నిక్కముగను నాకన్న శూరుడింకెక్కడుండె వారిజాపు మనుచు విషమెట్టి కరచె త్రొక్కించెను వినరన్నా అదిగాక పర్వతశిలలపైని బొరలించెను సుమ్మన్నా యెన్నిపాట్లు బెట్టి హరిహరియని యంటి మరువక హరినీవు వుక్కుస్తంభ మందు చూపింపగలవ కుమారా లేకుంటె నిన్ను నికనేరా ఖండింతును తక్షణమురా బల్కంగ నారసింహురాతా పెట పెట స్తంభంవెడలి కశ్యపుని పేగులెల్ల మెడజంద్య మేసినా॥ రామ॥

మున్నుకరులు దశలక్షకోట్లు వనమందుతిరిగి సంచరించి యావల యున్నమడుగులోపల జొరబడి జలమన్ని త్రాగుచుండగా మకరొచ్చి తన్నగాను కరిరాజు కాలుబట్టగనూ బట్టంగ గజమును బిరబిరమని పరుగెత్తిసాగిపోయ్యేనూ ధిక్కనుచు హరని వేడెదను వేడంగహరి చక్రము బట్టి దగ్గిపొయ్యేనూ కరిమకరుల వెయ్యేండ్లు పోరుసల్పంగ కరికిబలమంత కరినేలి మకరి శిరస్సునొట్టినా॥ రామ॥

భక్తుడైన కుచేలుడు విప్రుడు యుక్తమైన సతిసుతులతోను ఎదురెత్త మేమూలేకుండగ భక్తితోపిడికెడి సబ్బియ్యంబువండితిని పొట్టగడపి జీవించుచుండిరీ దేవా కొమాళ్ళు బాధపడలేక సతియు యిట్లనియె నాథునితో బాగా ముందు కృష్ణుడంటిని చెలికాడని వెళ్లినీవు అటుకులిచ్చి బిడ్డలు బాధపడిన శ్రమలంతదెల్పు మునినాథా కుచేలుడు అతి వినోదా కృష్ణునితో బల్కెనుగదా ఆశ్చర్యమొంది శ్రీనాథా వేడుకతో కుచేలుని కభయంబిచ్చి ఆదరించితివి శ్రీరఘు॥ రామ॥

ఇందువదన అరవిందలోచనా పొందుగ నినుపూజించెద మనమున ముంజేసినా పాపములున్నా కుందరదనజేయుము యిలలో నానంద నంద గోవింద పద్మదళనయనా మోమందు నను దయజూడ వేమి బిరానాముందు

భక్తులను బ్రోచితి నీబిరుదెందుబోయె హరి సింధుశయన యేమందు
గావ నీపొందుగోరితిని దేవా ధవళేశ్వర పురమున బాబా నారాయణదా
సుని బ్రోవ రక్షించుటకే బరువా మత్స్యమై జలధిలో జొచ్చి సోమకుని
ద్రుంచి వేదములు తెచ్చియిచ్చినా॥ రామ॥

౫. కీర్తన - రాగము - హిందూస్తానికాఫి - అటతాళము

శ్రీరంగా భవభంగా రక్షించు శుభాంగా
సారంగా సన్నురాంగా బిరాన బ్రోవంగా॥ శ్రీరంగ॥
ప్రసన్నా సుప్రసన్నా నినుగాయనేనన్నా
మోసమన్నా శాయకన్నా నీదాసునికన్నా॥ శ్రీరంగ॥
దిక్కంటి లేరంటి దీనుడనేనంటి
చక్కనంటి యుండుమంటి మిక్కిలి సుమ్మంటి॥ శ్రీరంగ॥
కనకచేలా గానలోలా మునిజనపరిపాలా
నన్నేల పంతమేల కరుణజూడు శ్రీలోలా॥ శ్రీరంగ॥
పుట్టుతన్నా గిట్టుతన్నా వట్టిమాయ సుమ్మన్నా
పుట్టితన్నా పాదమన్నా దిట్టముగ సేవన్నా॥ శ్రీరంగ॥
యాలయ్యా జాలమయ్యా తాళలేను సుమ్మయ్య
కాలమయ్యా గడపయ్యా బ్రోవుమయ్యా॥ శ్రీరంగ॥
ధరణిలోనూ ధవళగిరిని నివాసమైయున్నా
నారాయణ దాసుడన్నా నినుమరువక వేడుచున్నా శ్రీరంగ॥

౬. కీర్తన - రాగము - హిందూస్తానికాఫి - అటతాళం

రామరామ రామరామా రామరాఘవా
నా స్వామినీవని నమ్మితి దరిజేర్చి బ్రోవవా॥ రామ॥
మున్ను కరినిగాచిన మురవైరి రావయ్యా
నా విన్నపమాలించి నను బ్రోవవా యేమయ్యా॥ రామ॥
రాతినాతిగ జేసిన మహారాజు నీవంటి
నా పాతకములు బాపే పరంధామ శరణంటి॥ రామ॥
ద్రౌపది మానంబును గాపాడలేదా
నే పాపిని కడు ద్రోహిని కరుణించగరాదా॥ రామ॥
తల్లితండ్రి లేరు నే నీ తనయుడానంటి
చల్లంగ కృపజూడుమి శ్రీ వల్లభాయంటీ॥ రామ॥
నిన్నువినా వేరునాకు నీరజనయనా
నిన్ను సన్నుతించిన భక్తులనేలు పరిజకనయగా॥ రామ॥

ఉక్కు స్తంభమందు వుద్భవించితివన్నా
గ్రక్కున ప్రహ్లాదుని కాపాడినావన్నా॥ రామ॥
వాసిగాను ధవళగిరిని వాసమైయున్నా
దోసిలొగ్గి నారాయణ దాసుండేనన్నా॥ రామ॥

౭. కీర్తన – రాగము – రూపకము – తోడిరాగము

నారాయణ నిన్నే నమ్మితిని నీ నామమెప్పుడు పారాయణ జేసుకొంటిని శాధాధర జరిశనంబియ్యను ధీరుడావని నమ్మితిరా యేరా సుకుమారా రార వేదసేయక నన్ను వేగరక్షింపర॥ నా॥

దిక్కులేని దీనుడను గ్రక్కునా రక్షించుమినన్ను చక్కడా ఈ పుడమిలోను నిక్కమూ లేదు నీకన్నానుభుక్తి ముక్తిచ్చేటి బుధులార క్షించేటి భక్తులనేలెడ భావానతీతుండ శక్తిమాయలోనన్ను ద్రోయక ముక్తియు యుక్తిచేతను దాటించేటి శక్తుడవని॥ నా॥

తల్లినీవె తండ్రివీవె యెల్లబాంధవులునునీవే చిల్లర గుణములును ద్రుంచి చల్లగ కృప వెదజల్లవె యెల్లలోకంబులు యేలినవాడవె నల్లనయ్యా ననుజూడను కన్నుల అలనాడా శబరిచేతి యెంగిలిపండ్లు అంది భుజించిన భుజగశయనుడవని॥ నా॥

సంసార సాగరమున హింసలు పడిచెడితిక నాకంస హరర కరుణజూచి కాపాడుమి కమలలోచనా సంశయు మెప్పుడు లేక సద్భక్తుల చింతాలు బాపేటి శ్రీహరి నీవన యెంతాని వేదూదు యేమానిజెప్పుదు పంతముంచాకుము పరమదయాళుడ॥ నా॥

సింధుశయన వినుము నా మనవి ముందుకరిని గాచితి అందముగా పుడమిలోన ముందెందరినో బ్రోచితివి నందా నందా నింద గోవింద ముకుందా నీపొందుగోరితి దండాన సీతూకు అందరిలో నపకీర్తి రాకుండాగ ఆదరించి నభయంబు లిచ్చితివాని॥ నా॥

కుటిలదైత్యుని జంప పెటపెట స్తంభమునజూపి తటుకున ప్రహ్లాదునికి బాధలన్నియు మాన్పినటుల నారాయణ దాసూని కోరికకొదవ లేకుండా కొనసాగించెదనని యిటుల నీ నామము యేమరక యెప్పుడు వేడుకతోడాను వేడుచుంటికను॥ నా॥

౮. కీర్తన – రాగము – నామావళి – ఆదితాళం

నారాయణ రాంరాం గురుపారాయణ రాంరాం శ్రీధర రాంరాం రమాపతి యాదవ రాంరాం॥ నారాయణా రాంరాం॥

నారాయణ హరిహరి గురుపారాయణ హరిహరి శ్రీధరా హరి హరి రమాపతి యాదవ హరిహరి। నా॥

నారాయణ రంగా గురుపారాయణ రంగా శ్రీధర దేవా రమాపతి యాదవ రంగా॥ నా॥

నారాయణకృష్ణా గురుపారాయణదేవా కృష్ణా శ్రీధరకరుణా రమాపతి యాధవ కృష్ణా॥ నా॥

నారాయణ దేవా గురుపారాయణ దేవా శ్రీధర కరుణా రమాపతి యాదవ దేవా॥ నా॥

నారాయణ కరుణా గురుపారాయణ కరుణా శ్రీధర కరుణా రమాపతి యాదవ కరుణా॥ నా॥

నారాయణగురు గురువై పారాయణగురు గురు శ్రీధరకరుణా గురుగురు రమాపతి యాదవ గురుగురు॥ నా॥

౯. కీర్తన – రాగము – తోడి – రూపకతాళము

అన్నా ప్రసన్న రాఘవా అతిదీనుని బ్రోవవా॥

నిన్నాశ్రయించితిని యెన్నడు మోసము మదిని దలచకు మీదరి జేర్చుమి॥ అ॥

యన్నడునిన్ను సన్నుతినే జేసినాను యన్నడు కలుగునో కలుగదో విన్నపమాలించుట నీకన్నను సరివేల్పంటిని లేరంటని ధరనంటిని వరమంటిని యిమ్మంటిని॥ అ॥

పంతము లేకుండగాను సుంతయినదయజూడుమునను దంతిరక్షకుడవని చెంతకు చేరితినేను సంతసముగ నీదుభజన చింతనయప్పుడు మరువను అంతరాత్మనంత సచ్చిదానంద గోవింద ముకుందవరదుడా॥ అ॥

నేరము లెన్నున్నగాని భారమంతయు నాపైని మారజనక వేయక ననుగారవించుటనీవని సారెకునిను వేడెదు కరనిసరగునబ్రోచితివని నారాయణ దాసుని మొర ఆలించెడి ధీరుడవని॥ అ॥

౧౦. కీర్తన – రాగము – ముఖారి – ఆదితాళము

గోవింద నీనామము మరువనురా॥ గోవింద॥

అందు యిందుజూచిన ఆనందభరితుడవై వెల్గుచుండెదవు॥ గో॥

దశరథతనయుడవై జన్మించి దశకంఠుని కరములుద్రుంచినహరి॥ గో॥

మత్స్యజలధిలోజొచ్చి సోమకునిద్రుంచి వేదములు తెచ్చిన నరహరి॥ గో॥

ఉక్కుస్తంభమునుండివెడలి హరిగ్రక్కున ప్రహ్లాదుని గాచినహరి॥ గో॥

రాతినాతిగనుజేసి రమ్యముగ పాతకులనెల్లను బరిమార్చినహరి॥ గో॥

కరము౽పుల పోరంతవినియు కొంటె కరినేలి మకరిని గొట్టినహరి॥ గో॥
వాసిగానుధవళేశపురంబున వికాసమైన నారాయణదాసుడు॥ గో॥

౧౧. కీర్తన - రాగము మణిరంగ్ - చాపుతాళము

పరమదయాకర పాలించిబ్రోవర తడుణమి చేసుమ్మిరా రాఘవా మరువాక ననుబ్రోవరా॥ పర॥

నగుమోముజూపర నాతండ్రి యిటురారా పగవాడగానురా రాఘవా భగవద్భక్తుడాసురా॥ పర॥

స్నానసంధ్యా జపతపాము లెఱుగ నిదానముంచి బ్రోవరా రాఘవా దీనునిపై సుమ్మిరా॥ పర॥

మానాభి మానములే మానీ నేనిప్పుడు గానము చేసితిరా రాఘవా కనుకొని వరమివ్వరా॥ పర॥

నీలమేఘము కాయ బాలుడ పసిగాయ జాలము నీవుసేయ రాఘవా తాళలేను రావయ్యా॥ పర॥

ఆశించి యున్నాను మోసము సేయకు దోషాయ నీకేనురా రాఘవా కనుగొని వరమివ్వరా॥ పర॥

వేరెవ్వారు లేరు యీ ధరలోను నారాయణ దాసునూ రాఘవా నేరమెంచాకు నను॥ పర॥

౧౨. కీర్తన - రాగము - నాదనామక్రియ - ఆదితాళము

రాం౹రాం౹రాం౹రాం॥ రం౹రం౹రం౹రం॥

దామోదర నిను వేడినందుకూ దారిచూపవదేమి నీ మహాత్మ్యము తెలియక నే మోసబోతినిస్వామీ నీ నామము నమ్మకసుమ్మి వుచ్చాటన చేయక నమ్మి నే గాసిజెందితి వినుమీ సుమ్మీ॥ రాం॥

పంకజలోచన పతితపావనా పరమదయానిధే కరుణా శంకలేక నా సంకటము లన్నియు తీర్చుమి బిరానా నీ వాడను నేనుగానా నాకు వేరువేరు నీవే ఆదరణ నామనవి విను లక్ష్మీరమణా కరుణా॥ రాం॥

దీనజనులబ్రోచిన మహాదేవా దివ్యమూర్తి ప్రభావ భానువంశ రఘుకులతిలక నా బాధమాన్పగలేవా అతిదీనుడ నామొర వినవా నే బ్రమసి చెడితె జూచెదవా నాధారము నీ దనుకోరావా॥ రాం॥

కరివరదుడని మరిమరివేడితి కరుణజూడవా దేవా దరిజేర్చేటి ధాతదైవమని దలచితినే గోపాల నేవేడితి దయతోడదేరా వేడ్కతో బ్రోవుమీ శ్రీలోలా శ్రితజనకుని రఘుకులపాల సుచేలా॥ రాం॥

వాసిగాను ధవళేశ్వరపుర కాటంపేటలో నేనుంటి భాసురముగ

నారాయణ దాసుని మోసాము సేయకుమంటి మీకన్న వేఱలేదంటి యితరులగొలుచుట సుమ్మంటి నిక్కముగను వరమిమ్మంటి॥ తాం॥

౧౩. కీర్తన - రాగము - నామావళి - అటతాళము

రంగరారా భవభంగరారా అంగజ జనక భుజగశయనరారా॥ రంగ॥

పంకజదళనేత్ర నయన పంతమేలరా యింక నన్ను వేఱచేయకురా వెంకటేశ్వరా॥ రంగ॥

నీలవర్ణ దేహమేను మెఱయగారారా జాలము సేయకుమీగోపాల రారా ముదముతో నన్ను బ్రోవ ముద్దులయ్య రార వదలగామీపాదములను నరిగితిరా॥ రంగ॥

సారెకునిను వేడితి స్వామి రారా నేరము లెన్నున్నాను నన్నేలుకోరా॥ రంగ॥

దిక్కెవ్వరు లేని దీనుడి నేరా మక్కువతో నన్నేలుటకు మహారాజరాం॥ రంగ॥

దాసజనులా రక్షించే జగధీశ రారా ఆశించియున్న నారాయణ దాసునేరా॥ రంగ॥

౧౪. కీర్తన - రాగము - సావేరి - అటతాళము

శ్రీలక్ష్మిరమణా భక్తాచందన భవభయహరణారామరామయని నిన్ను ప్రేమతోను వేడెదాను కామితార్థములొసగి నన్ను కరుణతో కాపాడుటకును రావయ్యా రక్షించవయ్యా పామరుండ పాంకారుండను కడుపాపినని నీ మదిని నెంచక॥ శ్రీ॥

ఆశాపాశములుజెంది మోసమైచెడిపోతి యిక నా పాశబంధములన్నియు తెగగోసివేసి వాడవని నమ్మితి శ్రీలక్ష్మిపతి గాసిబెట్టక నీవు నను సంతోషముతో రక్షించు సుమతీ॥ శ్రీ॥

యెన్నివిధములు వేడినా విన్నప మాలించవేమి కన్నతండ్రివని నిను నమ్మితి కరుణయు రాకున్న దేమో గోపమా అయ్యో పాపమా పన్నగశయన సుప్రసన్న రాఘవ నన్నేలుమా॥ శ్రీ॥

తప్పులు నేనెన్ని చేసిన నప్పకుండే వాడవాని అప్పుడప్పుడు నీదు నామము గొప్పదని ధ్యానింతు మదిని చూడుమీ కనుగొనుమీ చప్పుడేమి సేయకుండ గొప్పపదవి జేర్చుకొమ్మీ॥ శ్రీ॥

వాసిగా భవళేశపురమునను వాసమైయున్న నారాయణదాసుని రక్షింపకున్న దోషమునీకే సుమ్మన్నా వేగరారావెంకటేశ్వరా దాసుల హృదయంబులో నివాసమైన వాడవాని॥ శ్రీ॥

౧౫. కీర్తన - రాగము - శంకరాభరణము - అటతాళము

స్వామి దయరాదేమయ్యా రం॥ స్వామి॥

యీక్షితిలోపరనీకన్నా వేల్పు లెవ్వరులేరు సుమ్మన్నా రక్షకుడా
వని నిన్నే నమ్మియుంటన్న ప్రేమతో నిన్నే రంగా॥ స్వామి॥

సరసిజదళనేత్ర నీవురా నీలమేఘము సేయబోవుగ కరని గాచిన
బిరుదుచూపర కరుణించి కాపాడురా॥ స్వామి॥

నరవశుడను నేను యుంటిని తప్పునేరముండిన దిద్దుమంటిని
పరమదయాళుడ వీవని భవములంటిని గొట్టుమంటిని॥ రం॥ స్వామి॥

భక్తవరులు నిన్నెల్లప్పుడు హరిభక్తితోను నినుగొలిచే టప్పుడు
ముక్తిచూపక తప్పదిప్పుడు భగద్భక్తుడు కోరినప్పుడు రం॥ స్వా॥

ధవళగిరీ పురమందునా నివాసమైయున్న నారాయణకవి చమ
త్కారముచేతను పొగడేదనా పక్షివాహనా రం॥ స్వా॥

౧౬. కీర్తన - రాగము - తోడి - రూపకము

నేరము లెన్నున్న నేరుమీ నీరాజనయన గారావము తోడను
జూడుమి కరినిగాచిన దొరవునీవని మరిమరి నిన్నే వేడుచుంటిని॥ నేరము

కరుణాకర త్రిభువన నన్ను కరుణించరాదా పరమాత్మా దయా
ళుడ ననుపాలించుమి నాథా ధరలో హరిదాసులకు దరిచేర్చగా లేదా
మురహరి నినువేడితె మొరవిని నీవు రాగవేగ ఉరగరాజ శయన
మురళిగాన వినోదా వెరువకుమని దాసునికి జెప్పుమి గురుబోధా
పరిపరి విధములు నిన్నువేడుశక్తియు లేకను మురహరి, నరహరి నారా
యణదాసుని దరిచేర్చుటకును॥ నేరము॥

౧౭. కీర్తన - రాగము - తోడి - రూపకతాళము

రామారక్షించుమీ ప్రేమానమ్మితి మనమున స్తోమా భీమపరాక్రమా॥

యేమింటిని యిమ్మంటిని వరమంటిని రమ్మంటిని యిమ్మహి
లోపలనుంటిని॥ రామా॥

దండివాడవనుచు నే నీ యండ జేరితిస్వామి ఖండవనమున దైత్యుల
ఖండించితివని సుమ్మీ పండిత ప్రభాకర ననుపాలించను రమ్మీతంద్రుల
కొడుకుల తప్పులు క్షమింపవలయును సుమ్మీ పుండరీకాక్షుండ తేజా
మండలాధిప మహారాజా ఖండితముగ నీదుపూజ మొందుగ నారాయణ
దాసుండను సేయను పంకజ॥

౧౮. కీర్తన - రాగము - హిందుస్తాని - కాఫిరాగము

సర్వాంతర్యామి సుమయీామి దేసుమ్మి యూర్విలోపలను నీకన్నా లేరు బ్రోవుమి॥ సర్వాం॥

బీదాకుచేలుని బాదా మాన్పితివని సాధు సజ్జనులు నీ స్మరణా మరువను మతిని॥ సర్వాం॥

పరవశుడాసూ రామా నెనరుంచి బ్రోవుమా పరమా తారక నామా పాలించు శ్రీరామా॥ సర్వాం॥

పంకజదళనయనా పాపవిమోచన శంకలేకను నా సంకటము బిరానా॥ సర్వాం॥

జపస్నానములు సంధ్యా తపములు నేనెరుగ నీ కృపకు జేరితి నిక సుమతీ త్వరితముగ॥ సర్వాం॥

నగుమోము జూపుమీా నాతండ్రి యిటురమ్మి పగవాడనాసుమ్మీా పాలించి బ్రోవుమి॥ సర్వాం॥

కనికారమును లేదా కనులా జూడుమి నాదా దిన దినము మీా పాద భజన జేసితి శ్రీరామా॥ సర్వాం॥

వాసిగ ధవళగిరి నివాసమై యుంటిని భాసురముగ నారాయణ దాసుడంటిని॥ సర్వాం॥

౧౯. కీర్తన - రాగము - మోహాన - అటతాళము

దేవదేవరా నన్ను బ్రోవవేమిరా స్థావరంబుగా ధవళగిరి పురంబురా॥ దేవదేవ॥

దీనరక్షకా నీవే దిక్కు నాకిక అన్యులా గాని వేడుటయు లేదిక॥ దేవదేవ॥

చిన్నతనమునా నుండి జేసిన స్మరణా పన్నగశయనా పాలించు బిరానా॥ దేవదేవ॥

మూాఢుడావని నీవు జూడవేమని వేడుకొంటిని పుడమి వేల్పు నీవని॥ దేవదేవ॥

యేలరావయ్యా జాలమేల నీకయ్యా బాలుడునయ్యా పాలింప రావయ్యా॥ దేవదేవ॥

దాసపోషకా దరిజేర్చు నీవికా మోసమేమికా కాయుబోవు సుమ్మికా॥ దేవదేవ॥

ధర నారాయణదాస గురువరేణ్యా పరమ పదము వారికందా జేయుమి రమణా॥ దేవదేవ॥

౨౦. కీర్తన - రాగము - నామావళి - ఆదితాళము

దేవరారా వాసుదేవ రారా నా కావరములన్నియు కడతేర్చుటాకురా॥ దేవదేవ॥

పరమపురుష పరమాత్మా పరంధామా రారా నే దురితుడవని నన్ను దూరనాడకురా॥ దేవదేవ॥

గోవర్ధనగిరియెత్తిన గోపాల రారా నా భవములన్ని గొట్టుటకు భద్రాద్రి రారా॥ దేవదేవ॥

మున్ను భక్తులనేలిన ముకుంద రారా నీకన్ననూ వేల్పులెవరు లేరు అవనిలోరా॥ దేవదేవ॥

దుష్టరాక్షసులనెల్ల దునిమి తీరితిరి నీ యిష్టభావమున సృష్టిచేసితివిరా॥ దేవదేవ॥

ప్రాకటముగ గోవింద నీ నామమురా పాకము పట్టిన పంచామృతమురా॥ దేవదేవ॥

ధరణిలోన ధవళగిరి కాపురము యుంటిరా మరువక నారాయణా మొరలు వినరా॥ దేవదేవ॥

౨౧. కీర్తన - శ్రీరాగము - అటతాళము

శ్రీరాజరాజేశ్వరి హరిజేర్చుట నీవేసరి రారా పారావారా గంభీరా నేరమెంచకుమీ శౌరీ॥ శ్రీ॥

జాలము శాయకుమీ జగజ్జాలముకొంటెసుమ్మీ తాళజాలా బాల గోపాలా నీలవర్ణ నేలుమీ॥ శ్రీ॥

కోటి ప్రకాశమురా రంగా మేటికిరీటమురా కోటీమేటీ మీపాటీ నీతోటి సాటెవ్వరు లేరురా॥ శ్రీ॥

పంకజదళలోచనా భవసంకటములు హరణా యింకా సంకా వంకా లింకా పొంకమనుచు నయనా॥ శ్రీ॥

దానరక్షకుడావని నిన్ను దోసిలొగ్గుచు నుంటిని ఆశా పాశా యీశా సర్వేశా గోసివేయు మంటిని॥ శ్రీ॥

యెన్నాళ్ళు బ్రతికినను దేహం కొన్నాళ్ళదే ననుచునూ అన్నా నీకన్నా లేరన్నా ప్రసన్నా విన్నవించెద సుమ్మన్నా॥ శ్రీ॥

శరణు శరణు రావయ్యా ధరనారాయణ దాసయ్యా ధారాధరా నీరాకార మొరవిని బ్రోవుమయ్యా॥ శ్రీ॥

౨౨. కీర్తన - రాగము - హిందుస్తాని - జల్వాతాళము

వేగమే దయజూడు వెంకటగిరినాయకా బాగుగా నిన్నునే భజించితి ప్రదాయకా॥ వేగమే॥

మీ పాదతీర్థమే మా కాధార మనుకొంటి దావు ధరినుండేటి దాత దైవమంటి॥ వేగమే॥

యెన్నివిధముల నిన్ను వేడినరావేమి మున్ను భక్తులనేలినట్టు నన్నేలుమీ॥ వేగమే॥

పన్నగ శయన ప్రసన్న రాఘవన్నా విన్నవించితిని నీ కన్నమా లేరన్నా॥ వేగమే॥

యెంతటివారు నీ వింతలు గనలేరూ దంతివరదా దయజూడుమినీ నెనరునా॥ వేగమే॥

తల్లి దండ్రియు గురుదైవము నేనంటి యుల్లములోపలను నిన్నే నమ్ముకొంటి॥ వేగమే॥

వాటముగా ధవళగిరి పురమునందునా పాట బాడుచు భక్తి తోడను నారాయణా॥ వేగమే॥

౨౩. కీర్తన - రాగము - నాదనామక్రియ - అటతాళము

నీలకంఠ నిండినావురా పృధివియందు సందులేక యిమిడి దాగినావురా బాలకృష్ణ జాలమేలతాళ లేనివేళ నేనూ కాలయముని బాధ దీర్చు పాలిత రంగేశ్వర యీజాలము నీకేలనురా॥ నీలకంఠ॥

కన్నతండ్రి కనుల జూడరా కుటిలాత్మకుడను నిన్ను కనుల జూడ లేనురా చెన్నమీరగాను శంఖు చక్రము ధరియించి నావనిమున్ను భక్తులచేత వింటిని అన్నా నిన్నిప్పుడు నా కన్నుల కానందముగ॥ నీల॥

వాసిగ కృషి జేయుచుంటిరా నీనామము నమ్మితే మోసము లేదని వింటిరా కాసుచేయని దేహము నీవు తీసివేసే దొరవు నీవని దోసిలొగ్గి యుంటి నన్ను మోసము కాయకురా నీదాసుని రక్షించుమిరా॥ నీల॥

నరహరి నిన్ను నమ్మినానురా వరమివ్వకుంటె మరువక అడుగడుగు విడనురా శరణునీవని మొరలిడినానుర హరి దయజూడవేమి నిరతమూ నీనామ స్మరణ గోరితి నాభారములో దూరిమి నారాయణా॥ నీలకంఠ॥

దిక్కులేని దీను డానురా ధరణంటి కంటి నిక్కమూ నీకన్న లేరురా వుక్కుస్తంభ మందు వెడలి గ్రక్కున ప్రహ్లాదుని గాచిన చక్కనయ్యా చిక్కులు బెట్టకు భక్తుడనే నే మ్రొక్కితిర గ్రక్కున ముక్తియ్యుమిరా॥ నీలకంఠ॥

పాపహరణ పంతమేలర ప్రతి పాతకుడను నాపైన నీకు గోప మేలరా శ్రీమతి శ్రీరామచంద్ర దాపుచేరి భజింపుచుంటి పాపములు హరింపు చేరి ఆపద లెడబాపి నీరూపము మది జూపుమిరా॥ నీలకంఠ॥

శరణు శ్రీహరి బిరుదుజూపుమిరా నారాయణ గురు కరుణచే నిను కలువరింతునుర దురితము లెడబాపు పరమపురుష నీవున్నావని మది తలచిన కానకాంబరమను మొరవినుమీ నెరనమ్మితి గిరిజాపతి దరిజేర్చుమీ॥ నీలకంఠ॥

౨౮. కీర్తన – శ్రీరాగము – ఆదితాళము

శ్రీరాజరాజ మహారాజేశ్వర రమ్మి నాభారమంతయునీదని బలికితిసుమ్మీ సారసాక్ష సద్గుణజనరక్షక పారవారగంభీర దయానిధే కోరి గోరి నిన్ను వేడినందుకు నీరజాక్ష నీదయరాదయ్యెయో॥ శ్రీ॥

ఘోరదుఃఖమునందు గూడినేనుంటే నా నేరము లెన్నున్న నెర వేర్చుమంటి మారజనక మురారి నూరిజన ఘోరకలుష నాశనభవ హరణా గారవించి బ్రోవుమి బిరాన సారసాక్ష పంకజదళనయనా॥ శ్రీ॥

పతితపావన నన్ను పాలించవయ్యా యితరులెవ్వరు లేరు గతినీవే నయ్యా నతిభక్తారక్షచూమణినీవని అతిథులకు ఆధారదైవమని సతతము నిను నేమరువక యుంటిని హితమతితో ధ్యానింతునుమదిని॥ శ్రీ॥

పాపఖర్ముడనాని కోపగించకుమీ విప్రాపుగోరితి నేను యేప్రొద్దు సుమ్మీ ఆపదలను రక్షించేటి దొరవని శ్రీపతి నినునే నమ్మితి సుమ్మీ తేప తేపకు వేడుట లేదని కోపగించినను శాపమివ్వకుమీ॥ శ్రీ॥

రవిచంద్రులాకన్న రమ్యమైయుండు భువిలో నీసాటెవ్వరు బోలు లేరెందూ వివరము ధవళేశపురంబున కవివరుడగు నారాయణదాసుని భవములనెల్లగొట్టి నిత్యావివేకజ్ఞానము నెఱిగించితివని॥ శ్రీ॥

౨౯. కీర్తన – రాగము – హిందూస్తాని – కాఫీ

గోవర్ధనగిరి గోపీనందన బ్రోవవేనన్ను వేగబిరాన సాలజలధి లోపల పవళించిన బాలగోపాలుడడవని దలచితి నాపాలి దేవుడవు నీవె ప్రసన్నా మేలుకొనుము పంకజ దళనయనా॥ గోప॥

గోరదుఃఖ భవనాశన హరణా కోరిభజింతును నామనమున సారెసారెకు వేడిన యికనా నేరములన్ని గొట్టుసుమ్మన్నా॥ గోప॥

నాదనాద జగన్నాథుడ నన్ను ఖేదములేకను బ్రోవుమీ నన్ను యీడలేక సంసారములోను బాధలుపడి శ్రమజెందితినేను॥ గోప॥

పంతముయేల ఫణిరాజశయన చింతలు దీర్చుమి శ్రీశశినయనా
యెంతయువేడినరాదు నీదయ గోరంతైన జూడుమి నీకరుణా॥ గోప॥
వాసిగధవళగిరీశపురంబునదాసనారాయణస్వామిజనార్ధనామోస
ముయెన్నడు కాయబోకు నా పాశబంధములుగోయు త్రిభువన॥ గోప॥

౨౬. కీర్తన-రాగము-నాదనామక్రియ-అటతాళము

నరులార శ్రీహరి నమ్మియుండండీ నరకములో బడి నలిగి
పోకండీ॥ నరు॥
భక్తిచేతను ముక్తిమార్గ మెతకండీ యుక్తిచేతను మాయా
భక్తిదాటండి॥ నరు॥
సుజనులతోకూడి సుఖము జెందండి భజనయెప్పుడును భావమం
దూ జేయండీ॥ నరు॥
వాద బేధములన్ని వదలి పెట్టండి మేదినిలో దామోదరుని
వేడండీ॥ నరు॥
యెన్నాళ్ళుబ్రతికిన సున్నా సుమ్మండీ కొన్నాళ్ళు దేహము కోరి
వేడండీ॥ నరు॥
తల్లితండ్రియుగురుదైవమనండీ చిల్లారిగుణములు జేయపోకండీ॥న॥
పరమభక్తులసేవజేయుచుండండిధరణిలోసిమ్మన్నదాసోహమండి॥

౨౭. కీర్తన - రాగము - కమాజు - ఆదితాళము

రంగారక్షించుమిర నీచెంగటానిలచితి భంగాముకాయకు॥ రం॥
గంగాధరనీకు నేరంగూాగ బూజలు ముందుచేయుచుంటి మోము
చూపవదేమి దొంగాదాసుడనంటివా గురువులమాని పొంగూచునుంటి
నంటివా స్నానము సంధ్యా గంగలో చేసెదనంటివా నీమోము నిష్టరాగ
ద్వేషాల కంటివా పంగనామముపట్టి పరమభక్తులమాని పొంగూచు
దిరుగుచుంటీన లింగలనారాయణ॥ రం॥
దాసూని మొరవినరా నన్ను మోసముకాయకు దోసిలొగ్గి
యుంటి దాసూని శ్రీశైలనాథ నిన్ను చిత్తామందున భజనచేసె వాడను
నన్ను గాసిపెట్టకుమయ్యా దాసోహ మనకుంటినా డంభాము కుండేవూ
సాలేనూ కుంటినా నిన్నెరుగాని కాశియాత్రలుబోతినా ప్రభలీన దేహ
వాసనాలో నుంటినా లేశమాత్రము నిన్ను జూచే వాసనలేక మూస
ముల్ గడుపుచుండిన శ్రీనారాయణ॥ రం॥
కంతిరక్షక జూడర వాంచితాలు బాపివాని చెంతాకు చేరితి
కంతిరక్షక రాత్రిపగలు వక్కరీతి వెల్లెవాని ప్రీతితోవేడితి స్తోత్రామా

లించావు గోత్రకులమెంచతినా అర్పితమాని యాత్రా వెళ్లిచుంటినా త్రేతాయుగ ప్రతిమావ ప్రొక్కితినా తంత్రాము చేసే మంత్రాము లన్నియు కంటినా సీతాపతే నిన్నుప్రీతితో చూడక నేత్రము లిప్పకుంటిన ధాతా నారాయణ॥ రం॥

మారకోటిరూపకా అతికారుడవనినే గారవించుచుంటి శ్రీరమా రామనాథ నామొరాలకించావు ఘోరదుఃఖమునందు నారాయణా యనిగోరిభజించాలేదా నీనామాము దూరపర్చుకుంటినా పరవారిని ప్రేరేపింపకుంటినా సారములేని నిస్సారమె నీవంటినా సారవిహీనా సంసార దురాశాలఃకోరుచు తిరుగుచుంటిన వీరనారాయణ॥ రం॥

పాపవిమోచవరా శతకోటి భానుతేజ నాపాలి శ్రీరామా పాసాఖర్మ్మాడని కోపాగించకుమి జ్ఞానానందరూపా రూపుచూపవే మీదాపూ చేరియుంటిర నిరాకరా నీపనిమైయుంటిరా ప్రపంచామురూపు నీవేయని యుంటిర నీభక్తునిదాపు జేర్చుమంటిరా రేపుమాపనరాను అపదదీర్చు నీరూపుకనశాంబ్రమునకు చూపునారాయణ॥ రం॥

౨౮. కీర్తన–రాగము – కాంభోజి–ఆదితాళము

నారాయణ వాసుదేవ నిన్ను నమ్మితి మహానుభావా దారాధియామణత్రయముల లోపల దూరీ తనామాముగోరి వీడువనైతి ఘోర పాతకుడనుచు నన్నిక దూరనాడుట మేరగాదుర చేరితిని సద్గురుడవై దుర్గుణము లెల్లను త్రుంచలేవా॥ నా॥

యెందు చూచిననందు నీవు సందులందున నిండినావు కుందరదన గోవిందా నీ నామము యెందున మరువకుంటి చెంతనాడకుమయ్యా ఆదియంత్యము లేనివాడా సాధులను రక్షింతువని నీపాదములు నెరనమ్మి వందుకు బిడుడను రక్షింపలేవా॥ నా॥

భక్తజనుల బ్రోచెదేవా మాయా శక్తిని విడదీయలేవా దిక్కునీవెయంటి దీనానిబ్రోవవా యక్కడయుంటివో మక్కువ గననైతి చక్కని శ్రీరామచంద్రా నిక్కముగ నా పాతకములను గొట్టివేసే వాడవనినే చిక్కితిని రక్షింపలేవా॥ నా॥

రామ రక్షణజేయు భీమాహల్యా శాపవిమోచనరామా ప్రేమ చేతను నిన్నూ వేమారువేసిన యేమందు దయరాదు మోముచూపుము స్వామి పామరుడను నాదుమనవియు వేమారు ఆలించి దుర్గుణసంచితార్థములెల్ల ద్రుంచి వెంటనే రక్షింపుమంటిని॥ నా॥

కనికారమును లేదా నీవు నన్ను కన్నెత్తిచూడరా పరాకు నిన్నా శ్రయించి నీకన్నా లేరనియంటి పన్నగాశయన పంతామ నామీద పన్నాగ నారాయణా గురుకన్నాను మరిమరి లేరనుచున్న కనకాంబర ముమ్మా మాటికిరమ్మి వేగ నన్ను బ్రోవా॥ నా॥

౨౫. కీర్తన—రాగము—కమాసు—అటతాళము

స్వామినా మొరాలించి బ్రోవుమిరా నామరూపక్రియలేనిగురు॥ స్వా॥
కామక్రోధ లోభ మోహ మదములు హరించె రఘురామునిన్ను నమ్మితే నేమారకుంటిగా ప్రేమచే నీనామ అమృతాము గ్రోలుచున్న వారి సామరత్వమెల్ల అగ్నిపాలు జేయుచున్నగురు॥ స్వా॥
చక్కని ప్రపంచమందు మిక్కుటమైనట్టి మాయ యొక్కవ చిక్కులు బెట్టుచున్న దేవేళా మక్కువతో డుత నీదుయేక చక్రముతో మాయాశక్తిని దాటించుటకు దిక్కునీవే యంటి గురు॥ స్వా॥
వాదభేదమైన దేహ బాధలు భ్రమింపచేసి చోద్యముగ బొమ్మ లాటాడించుచుంటివా వేదమూర్తి బాధలన్ని యెగరజిమ్మకుంటే నిన్ను కాదనుట నేలను నాకారణ మిట్లుండే గురు॥ స్వా॥
కలగని మేల్కొన్నగాని తలపేవేళ మరువక నిన్నుపిలచి వేడు చున్న పల్కకున్న వేమిర నిల్కాడలేనట్టి మాటనిలువకున్న గురుని తలచితే నామనసు తల్లడింపుచున్నదయ్యా గురు॥ స్వామి॥
యుల్లమందున నీకన్న వేల్పులెవరు లేరోయన్న చల్లగా నారా యణగురు జేరితినన్నా చెల్లునుకనకాంబ్రము మీపాదములో త్తుటకన్నా కొల్లాగదంచిన తలపులిచ్చినా అచ్యుత గురు॥ స్వామి॥

మం గ ళ హా ర తి

శ్రీరఘురాజా హారే హారతినీకూ॥
అందముగను ఆధారపద్మమున ముందుగణపతికి ఆరువందలూ॥ శ్రీ॥
సొగసుగాను స్వాదిష్టపద్మమున అగణితముగ బ్రహ్మకు ఆర్వేలు॥ శ్రీ॥
మరిమణిపూరక పద్మమందున మెరయుచున్న విష్ణుని కార్వేలు॥ శ్రీ॥
సుందరముగ అనాహతపద్మమున పొందుగాను రుద్రున కార్వేలు॥ శ్రీ॥
వినయముతో విశుద్ధపద్మమున ఘనజీవాత్మునకు వకవెయ్యా॥ శ్రీ॥
భ్రూమధ్యమునాగ్నేయపద్మమున రమపరమాత్మునకు వకవెయ్యి॥ శ్రీ॥
దండిగాను సహస్రారపద్మమున నిండియున్న గురునకు వకవెయ్యి॥ శ్రీ॥
హారలిచ్చె నారాయణదాసుడు ఖురువది వకవెయ్యారువందలూ॥ శ్రీ॥

ఓం గురుబ్రహ్మం

క. అండము గాధారంబున,
పొందుగ దళములును నాల్గు వ, శ, స, ష లుండున్,
ముందుగ ఆదిగణాధునీ,
వందనములు జేతు ఆరువందలు నెపుడున్.

క. మ్రొక్కెద అద్వైతమునకు,
మ్రొక్కెద ఓంకారప్రణవ మేధినిలోనన్,
మ్రొక్కెద హరిహరులకు నే,
మ్రొక్కెద పరమాత్మ భాగవతులకు నెల్లన్.

గీ. వందనము నీకు గురువరా నందముగను
ముందు చేసిన ఖర్మము ల్బాసుటకును,
సంగు దెలిసితి పరమాత్మ పురమునకును
పొందుగను గురువరేణ్యా పూజింతు నిన్ను.

గీ. స్థిరముగా శ్రీజగన్నాథస్వామిగురుని
ధరను కనకయ్య కరములలో మ్రొక్కితిమని
ఆర్యదర్పణ సాంఖ్య తారకము జతని
పంచి నారాయణదాసు కొసగె భువిని.

క. వణకదు చలివానలకును,
జణకదు కాలాగ్ని బాణజాలంబులకున్,
రణబేరి వేసిచాటెవె,
గుణరూపము నీనివాడె గురుజగధీశా.

క. వైరాగ్యము గలిగుంటెను,
ఐరావత మెక్కియుండు వైకుంఠమునన్,
వైరాముని గానకనూ,
మైరావణువలె మరణమొందెను భువిలోన్.

క. జ్ఞానానందము గనుటకు,
మానవజన్మంబెగాని మరియొకటుందా,
నానామతములలో బడి,
గానక బ్రహ్మంబునరులు వశులయ్యెదరూ.

గీ. మోహమనే సాగరము దాటవలెను మనస
సోహంభావము చదువు నేర్పరుగు మనస,

యిహాము పరలోకసుఖము జెందెదవు మనస,
సాహసంబులు గూడి చెడిపోక మనసా.

గీ. యోగములలోను రాజయోగంబె రాజు,
త్యాగములలోను మనసు త్యాగంబు రాజు,
భోగములలోను విరాగభోగంబె రాజు,
యాగములకంటె భక్తిజ్ఞానంబు రాజు.

క. కడక్రంబుల మీదను,
నడచుచు జీవాత్ముడెపుడు సోహం బనుచున్,
తడబడ కుండగ జపములు,
విడువక ఆర్నూరు యిరువదొక వెయ్యిన్ జేయన్.

సీ. తీర్థయాత్రలు యెన్ని ♦ తిరిగిసేవించినా
ప్రారబ్ధ ఖర్మముల్ ♦ బాసిపోవు
ముందు జేసిన ఖర్మ ♦ మనుభవించకగాని
యమధర్మరాజు ♦ వధించలేదు
పుట్టినప్పటినుండి ♦ భక్తిచేసితెగాని
ఆగామి సంచితం ♦ బిడువబోదు
జ్ఞానులవద్ద యుపదేశ ♦ మొందితేగాని
మానవజన్మమునకు ♦ ముక్తిలేదు.
గనుక పంచేంద్రియంబులు గట్టిపరచి
అనలమందున దుర్గుణము లన్నిద్రోచి
ఘనముగను గంగగోత్రమం దుద్భవించి
వినయముగ కృతిరచియించె వేడుకలరా.

## గణపతి స్తోత్రము

౩౧. తత్వము-రాగము-నాదనామక్రియ-అటతాళము

శరణు శరణు వినాయక నా శరణు చేకొను నాయకా స్థిరము
గను నిను వేడితి కరుణించు ముక్తిప్రదాయకా॥ శ॥

అంతముగ ఆధార కమలమునందు కధిపతి నాయకా ముందు
నిన్నార్నూరు జపములు జేసితిని గణనాయకా॥ శ॥

యెల్లవిద్యలకెల్ల ప్రభువని ఆశ్రయించితి నాయకా చల్లగా నా
మీదకృప వెదజల్లుమీ గణనాయకా॥ శ॥

విరివిగను హిమవంతు పుత్రిక తనయుడవు గణనాయకా దురిత
ములు దెగకోసి వరమునకు దారిజూపు వినాయకా॥ శ॥

వగవకుండగ వైరాగ్యము నూహించి భగవత్ సంకీర్తన మెప్పుడు చేయుచునుండి నిగానిగా ననాహత మండపమందు పదియును రెండు దళములు మేఘవర్ణముగ గద్దెపైకూర్చున్న హృద్రుద్రుని కాదు వేలు॥ పూ॥

భూభాములంతయు నూడుకొని మలమూత్రా శరీరంబవ్యా శత సంవత్సరమూలు మితము జెప్పిరిగాని సతమూని నమ్మాకు క్షితిలో యీజన్మము హితవుతో విశుద్ధ మండపమందు పదియారుండు దళ ములు జ్యోతివర్ణముగద్దెపై జీవాత్మకెపుడు దళశతంబులు॥ పూ॥

కాలమంతయువృధా పాలూశాయక గురుకీలు దెలుసుకొనుడి లోలాత్ములార ఈలోతు దెలుసుకొనుడీ కాలాయముడు మహా కఠిన చిత్తుడట మేలుగ ఆగ్నేయ మండపమందు రెండు దళంబులందున నీల మేఘగద్దెపై పరమాత్మకెప్పుడు దళశతంబులు॥ పూ॥

వాటముగాను మూడేరులనడుమ త్రికూటముగలదట మూటిని రోసియు మూటినివిడనాడి నాటుమి రామనామము నావగాచేసి నేటుగా సహస్రార మంటపమందు వెయ్యిదళంబు లందున కోటిసూర్యులు కాంతి గద్దెపైయున్న గురునకు దళశతంబులు॥ పూ॥

పరమహంసలునడచే స్థిరమైనబాటిది గురుకృపచే గలుగును తరుణ మింతటికన్న దొరుకుట దుర్లభం దిరిగి జన్మమురాదు నరక ప్రాప్తమేగాని ధరనుపీర్ మొహిదీనుకృపచే నెరిగి నారాయణదాసుడు యిరువదొక వేలారు నూర్లను దినదినము తారకము చదువుచు॥ పూ॥

౩౮. తత్వము-రాకము-నాదనామక్రియ-అటతాళము

యెక్కడుంటే నేమిరా గురురాయుడుండగ భయమురా యెక్కడుంటే నేమిభయమిక చక్కనిగురుమూర్తిదొరికెను నిక్కముగ కను రెప్పపాటున జ్యోతిరాముల చూచిపాయును॥ యె॥

ఆసనస్థానంబునూ ఆధారచక్రంబుండునూ అర్ధచంద్రుడుబోలు వర్ణము పసుపు నాల్గుదళంబులును వ—శ—ష—శాఖిని శక్తిగణపతి కారునూర్లు జపంబు సల్పితె॥ యె॥

ఉపస్థానమునందును స్వాధిష్టచక్రంబుండును మూడుమూలలు ఆరుదళములు రక్తవర్ణంబమరి బ—భ—మ—శక్తికాకిని బ్రహ్మ అధిపతి కారువేలు జపంబు సల్పితె॥ యె॥

మరియు నాభిస్థానమున మణిపూరకంబమరుండును దశదళంబులు హారిత వర్ణము డ—ఢ—ణాల్ పది అమరియుండును శక్తిఢాకిని విష్ణు డధిపతి కారువేలు జపంబు సల్పితె॥ యె॥

హృదయకమలమునందును అనాహత పద్మంబుందును మేఘ వర్ణముబోలు పదియును రెండుదళములు అమరి క—ఖ లుండు ఢాకి[illegible] శక్తిరుద్రున కాదవలు జపంబు సల్పితె॥ మె॥

కంఠస్థానమునందు విశుద్ధాంబుజం బమరుండును పదియు నా[illegible] దళంబులొప్పుచు జ్యోతివర్ణం బమరి అ—ఆ లుండు ఢాకిని ఈశ్వరునకు దశశదంబులు జపంబు సల్పితె॥ మె॥

నవనద్వయముల నడుమను ఆగ్నేయచక్రంబుందును రెండుదళ ములు నీలవర్ణం బమరియుండును హం—క్షం—బులు శక్తి హాస్తిని సదాశివునకు దశశతంబులు జపంబు సల్పితె॥ మె॥

దండిగను సహస్రారపద్మము వేయిదళములు అమరియుండును ప్రణవమనె ఓంకారబీజము కాంతి మాణిక్యంబుబోలును శక్తిఢాకిని గురుడు అధిపతి దశశతంబులు జపంబు సల్పితె॥ మె॥

అరమరలు లేకుండగను సర్వము బ్రహ్మము నిండెను కరువుదీరగ దొరికె మంత్రము గురుకటాక్షమువల్ల దినమునకు యిరువదొక వేలారు వందలు తారకము జీవాత్మ జదివితె॥ మె॥

మరపు తెరపన కుండనూ హరి నిరతమును జపియించునూ తలచుగా యీమంత్రమెప్పుడు పరమహంసల వద్దయుండును ధరణిలో నారాయణస్వామి దాసుడై కనుగొన్న వెనుక॥ మె॥

## ౩౫. తత్వము—రాగము—నాదనామక్రియ—అటతాళము

ఆత్మరాముల పూజశాయండి జనులార మీరు ఆత్మనాత్మ వివేక మెరుగండీ

ఆత్మరాముల పూజచేసితె పాతకము లెడబాపుయిలలో ప్రీతితో వైకుంఠపురమునకు ధాతలై దరిజేరిపోదురు॥ ఆ॥

ఆరుమూటిని గదుము చుండండీ జనులార జడియక మేరుపర్వత శిఖరమెక్కండీ తరుణమిదె సద్గురులచేరి సాంఖ్యతారక యోగమెరిగి గురుకటాక్షమువలన యిరువయియారోతత్వం బరసిచూచి॥ ఆ॥

సాధనంబులు నాల్గుగలవండీ జనులార యెనిమిది గాదులను మల్లించు చుండండీ వాదభేదము లేక యెప్పుడు సాధులతో సాంగత్య మెరిగి వేదశాస్త్ర పురాణకావల మీదనుండెడి భోదగనుగొని॥ ఆ॥

కర్పూరము దీపంబుచూడండి జనులార దర్పణ భావమెరిగితే భ్రమలు విడువండి నేర్పుతో నిదానముంచి రెంటినొకటిగ జేసి మధ్యను ఓర్పుతో ఒనరంగ చూపులో కోటిబానుల తేజముగుపడు॥ ఆ॥

దేహము గేహమువలె శల్యములు ఏర్పడియుండెను నరములెల్ల పెండికట్లు మాంసచర్మమూ గృహములో కొనావేళ్ళ జీవుడుండి వెళ్ళి హొయ్యెను కానిమిద మైనప్రొంచక వల్లకాటిలోబెట్టి కాల్చి వేతురు॥ యే॥

ఘటమువంటి దేహమునకు ఘటములారమరి యుండేను ఘటములలో జీవాత్ముడు జపించుచుండునూ యిటువలె యిరువదియొక వెలార్న్నారు హంసలుగడిపి దినములు మితముగడచి హొయ్యెనుకా కాసుకి కొరగాని దేహం॥ యే॥

యండవానలకు గయుడిమొర్వలేనిదీ దేహము కుండపగిలినట్లు తనువుయుండపోదురా దండిగా సద్గురునివద్ద దారికనుగొనుటాకు మంచి తరుణము యిక దొరుకపోదు నీటిమీాద బుగ్గావంటి॥ యే॥

ధరణిలోని కనకయ్యగురుని మరువక భజియించుచుంటేదురితము లన్నియు తొలగి దూరమానురా స్థిరముగాను నారాయణదాసుడు జెప్పినమాట మరువకయుంటేను పరువిదొరకును పాపిష్టిజన్మం॥ యే॥

3౮. తత్వము-రాగము-పరుజ-అటతాళము

ఏమీాజెప్పుదు కాయపురము శృంగారము యేమానివర్ణింతురా నమ్మామిహొడవు తొంబదియారంగుళమూలు యిమ్మాగ నాల్గుజావలు కై వారంబూను యెముకలరువదియారు రోమములుండు ముప్పదిమూడు కోట్లట నమరుతొంబదిరెండుకీళ్ళును అడునట మనయిష్టముగను॥ ఏ॥

రుధిరమంతయు అర్ధశేరు ముప్పదిమూడుమూరల పేగుండూనట అదిగాక మణుగు నాలుగుశేర్ల మాంసము చెదరాకుండగ శేరూగుండే లమరుండూను విధితముగ పైత్యముసోలెడు శ్లేష్మమును అరసోలెడుండట పృధివాయువాకాశ అగ్నిజలంబు లైదులో చెందినారట॥ ఏ॥

సప్తాసముద్రముల్ కుక్షిలోపలనుండి పొంగిపారుచు నుండేనూ సప్తద్వీపములు సప్తాపర్వతములు సప్తలోకమూలు సకలామంతటికి నిరతముగను బుద్ధియు ప్రధానియు రాజుమనసై యొప్పుచుండగ గుప్తరుంగజత మన్నినాయకు లిద్దరును పికారుచేసిరి॥ ఏ॥

కలపూమూడారు ద్వారములు బురుజులుమూడు శక్తులైదుగు రుండిరి నలుగూరు కర్నాలు శత్రుకాగ్గురు నిలచితొలగి ఎంతటి వారొచ్చిన లోచనివ్వరూ పులులుపందులు అశ్వములు మదగజములునుతోడే ళ్లమొదెలుగకిలకిలక్కిల పెనుగులాడుచు పురములోపలపిక్కటిల్లెను॥ ఏ॥

ఉదయమనక చంద్రా భానుడుదయించును మదినిల్పి సాధించితె ముదముతోడుత లెక్కలేనినక్షత్రముల్ కొదువలేకుండగా కోటులదృుత

ములూ యధికముగ మల్లెలు మొల్లలు మంచిచేమంతులు కన్నులు చెదిరితే సోజ్వాలములై నటువంటి పుష్పపు వనము బాంచుము॥ ఏ॥

యేడుకోటలలో మహాశ్చర్య నడుమనాను గంటి స్తంభం మేడొకటి వుంచేమా వేడుకతో కనకదుర్గ నెక్కి జూచిచూడు నారాయణదాసుని కినిజూపి చూడగా శ్రీరాములుండుట నామనసా నేమితెలదట పుడమి లోపల పుట్టబోడట పుట్టితె మరిగిట్టబోడట॥ ఏ॥

### ౩౯. తత్వము—రాగము—శుద్ధసావేరి—అటతాళము

రాజులేని రాజ్యమందున రాచచిన్నది యున్నది తేజరూప స్వభావమెవ్వరు తెలియలేనటువంటిది॥ రా॥

యేడుచుట్లు కోటలోపల మేడకట్టించుచున్నది ఆ మేడలో దశ విధములైన నాదమినబడుచున్నది॥ రా॥

వెయ్యికాళ్ళ మంటపములోన కొలువై యున్నది శయ్యపై పవ ళింపుచు నిద్రాహార మేమియు లేనిది॥ రా॥

లెక్కలేని గోట్ల రాణువ చుట్టుప్రక్కలయున్నది నిక్కముగ బుద్ధియు ప్రధాని రాజు మనసై యున్నది॥ రా॥

రాయభారము కననిది వైరాగ్యమైనా చిన్నది మాయనరికిన వారిని నేమరులుకుంటా నన్నది॥ రా॥

పంచభూతముకానిది ప్రపంచములోనున్నది మంచిగురుని ఆశ్ర యించితె కొంచెములో వశమానది॥ రా॥

మొద్దులకు కనరానిది గుజ్జులనారాయణ కన్నది అర్థములోని నర్థమంతయు సిద్ధముగా జెప్పుచున్నది॥ రా॥

### ౪౦. తత్వము—రాగము—కాంభోజి—అటతాళము

చూడుమీ కనుపాపల నడుమనురా అసాధ్యమైన చోద్యమున్నది॥ చూ॥

చూడుమీ చూడుమీ నీవు చూపులోన చూపుజూచి చదరనివ్వ కుండా మనసు కుదురుగా యిడపింగళనడుమ యిరవు చేసుకొని అతి వేడుక తోడుత చిన్నయాట లాడుచున్నదట॥ చూ॥

పంచభూతములైదును పంచి యిరువైయైదు ఆవలున్న తత్వాంబర నీజాడు తిన్నదనమునా పంచవన్నెల పుష్పమందు మించిన మూడేర్ల మధ్య పంచభూతమును లేని పరంజ్యోతి వెలైనట॥ చూ॥

కర్పూర దీపము బూని కర్పూరాళ్ళ బూజమూని కదలకుండే దర్ప ణము కరమునాబట్టు ఓర్పుతో సద్గురునివద్ద నేర్పుయెరిగి జూచితే అర చేతిలో వైకుంఠమిచ్చే జ్యోతిరాము డుండునట॥ చూ॥

బట్టబయలైయున్న బ్రహ్మాం గుట్టు తెలియలేక మనము వట్టి మాయలోబడి కట్టుబడుదుమూ బట్టుగిట్టును లేని బ్రహ్మాం గుట్టు గురువుల చేతకంటె యెట్టికర్మములున్నాను కట్టుబడిపోవునట॥ చూ॥

ఆరుమూడు ఏడుతొమ్మిదెనిమిది పద్నాల్గుపదియు అయిదురెండు వకటినాల్గు ఆరససిదెలియూమీ ధారుణిలో నారాయణదాసుడు నద్భక్తులాగు దోసిలొగ్గుచూను పాదసేవ జేయుచున్నాడట॥ చూ॥

౪౧. తత్వము—రాగము—రేగుప్త ఆదితాళము

రామతారకము బాటన్నా మరి యెముడుదరికి యిక రాడన్నా రామతారకము రాజబాట ఘనరమ్యమైన బుధజనులునడిచేటి॥ రా॥

తనకుతానే జీవాత్మన్నా అనుదినము యేమరక జపించన్నా సనకసనందన నారదాది ఘనమునులు భుజించిన మధుర ఫలంబిది॥ రా॥

పుట్టుగిట్టుటలు సున్నన్నా యీ గుట్టు తెలిసితె సుమ్మన్నా వట్టిమాటలచే వాదులాడితె పట్టుబడున యిది యెట్టివారికి॥ రా॥

మెంచినీవు యోచించన్నా పంచేంద్రియముల కాయమురన్నా మంచిగురుని ఆశ్రయించి రంచితముగద్వంచినేసే దృఢమైన స్థూలమిది॥ రా॥

వాతపైత్యమునకు మందన్నా ఫణిభూతగణములకుపిడుగన్నా జాతఫలమువల్లనుదొరుకును ఈలోతు తెలియ మూఢాత్ములతమా॥ రా॥

తరుగువిసుగు లేనిదన్నా గురుతరువున మరుగై నదిరన్నా హరిహరాదులకు అలవిగాని పరిపూర్ణభావమునకు బాటనిజంబిది॥ రా॥

మాధవనామము మరవకన్నా వెట్టిగాథరలోబడపోకన్నా సాధుసజ్జనుల చెంతజేరి యీబోధకంటే యమబాధ తొలగుమా॥ రా॥

బురుజులు మూడని వినరన్నా గురుమర్మము దొరుకుట అరుదన్న ధారుణిలో నారాయణదాసుడు తారకమంత్రము తరుచుగ చదివెను రామతారకము బాటన్నా॥ రా॥

౪౨. తత్వము—రాగము—శుద్ధసావేరి—అటతాళము

బాలచిన్నది గోలరా కచుముదిమి యవనము లేదురా నీలమేఘము మధ్యమున నొక మెలుపువలెనూ మెరశెరా॥ బాల॥

ఇంద్రియంబులు లేవురా కర్మేంద్రియంబులు లేవురా చంద్రభానులు కోటియయిన ప్రకాశమునకు సరిరారురా॥ బాల॥

చెప్పచోద్యము కాదురా కనురెప్పచాటునయుండెగా నిప్పుమీదను నివురుగప్పిన కుప్పవలె నున్నదిరా॥ బాల॥

తొమ్మిదీ ద్వారాజ లమరిన మేడగదులున్నాదిరా నమ్మకముగల జంటులార్గురు కావలి బెట్టిందిరా॥ బాల॥

తోడు లేకను యీడపింగళ మధ్యమందున్నాదిరా పుడమిలో ఘన రాజయోగుల వశమౌ నేనన్నాదిరా॥ బాల॥

మాయమనుజులు మాయలోబడి మరచిపోయిరన్నాదిరా మాయకును ప్రతిమాయచే నా మదుగు గనుమన్నాదిరా॥ బాల॥

సృష్టిపుట్టక ముందెబూర్వము పుట్టితినన్నాదిరా దుష్టులకు సాధ్యంబుగానని చాటుమనుచున్నాదిరా॥ బాల॥

కోపతామస మణచిభక్తుల గాచినా నన్నాదిరా పాపపుణ్యము రెంటికిని నేసాక్షి ననుచున్నాదిరా॥ బాల॥

సిద్ధముగ కనకయ్యగురుని వద్దగూర్చున్నాదిరా బుద్ధికని నారాయణునికీ సుద్దులూ జెప్పిందిరా॥ బాల॥

### ౮౩. తత్వము-రాగము-ముఖా-ఆదితాళము

చెట్టుమర్మము దెలుసుకోండోయి జనులార చేరి సద్గురిని వెతకండీ అవనిలో వృక్షములు అండముగ పొల్లాడి నందులో బీజంబు క్రిందపడి మొలచెనట॥ చె॥

మూలమంత్రంబు గనుగొనండి జనులార ముక్తిమార్గంబు వెతకండి వాల్మీకినారదులు నిమిషమైనను నేమారక హంసద్వయం బెరిగి హరిపురము జేరెనట పూరకము రేచకము తారకము సూటెరిగి నడవవలసె బాట నాణ్యముగ దెలుసుకొని యిరువదీవక వెయ్యి ఆర్నూరు హంసలు జపము జరిగించితె జననంబు లేదట॥ చె॥

రాతిప్రతిమలా నమ్మకండోయి జనులారా నాతివలపులు మానుకొండి నీతితప్పక మనసు నిత్యముగ దృఢపఱచి కామక్రోధాదులనుగాల్చి మసిగాచేసి అష్టమదగజములను యిష్టమున తెగనరిగి కంటిపాపనున్న కాశిక్షేత్రంబుగని నవరత్నఖచితమైనట్టి పీఠమునందు స్త్రీపురుషుడును గాక శ్రీరాములుండునట॥ చె॥

తొమ్మిదీ ద్వారములకొంపోయి జనులార తోలుబొమ్మని తెలుసుకొనుడీ యిమ్ముగను మేలెరిగి యిహసుఖంబులు మరచి జోడుపిన్నెనగరలు బాగుగా నూదుచును దృక్కుచును దృఢపరచి దృశ్యచిన్నెలు జూచి ప్రాకారమంటపాల్ పదిలముగ గడచుకొని శ్రీశైలపర్వతము శిఖరమందున నల్లగుడ్డు నడుమను పక్కగూబ గూర్చున్నదట॥ చె॥

బాధగురువుల నమ్మకండోయి జనులారా బోధగురువులను వెతకండి వేదప్రమాణమునకు వ్యతిరక్తిగాకుండ నడవవలెనుమ్మండి నగుబాటులేకుండా యీజన్మమునకన్న అధిక జన్మములేదు దిట్టపొత్తేమల్లిపుట్టుగులు లేవు యితరవేల్పులయందు వుంచకను చిత్తమును స్థిరచిత్తుడైయుంటే పరము కలిగియుండెనట॥ చె॥

చెట్టుపైనొకఫలముకలదోయి జనులార పట్టుకొనుట పట్టుపడదూ పట్టిమాటలుగావు యుర్విలోపల నొక్కచెట్టుబుట్టెను చివరకొండ పై మొదలుండే యిట్టి మర్మముకంటె యెట్టికర్మములున్న కట్టుబడిపోవునని నారాయణదాసు గుట్టుగురువులచేరి పట్టిసాధించితె పుట్టుగిట్టుగులేని బట్టబయలుండునట॥ చె॥

## ౨౨. గురుశిష్యులసంవాదము—రాగం—నాదనామక్రియ—అటతాళము

రాజయోగమురమ్యమందురు బోధదెల్పుమి గురువరా తేజమైనది రామనామము రాజమార్గము శిష్యుడా॥ రాజ॥

మార్గమెరుగక మాయలోబడి మరచితి సద్గురువర స్వర్గలోకము జేరెదవు వర్గములునరికితే శిష్యుడా॥ రాజ॥

సరికెడను వర్గముల మర్మము మరుగు తెలియదు గురువర కామక్రోధలోభ మోహామదములు శిష్యుడా॥ రాజ॥

మధగజంబులు యెనిమిదందురు విధము తెలియదు గురువర చదువు యవ్వన రూపకుల ధనమదము లందురు శిష్యుడా॥ రాజ॥

ఆదిభూతము లైదుగలవట పాదు తెలియదు గురువరా పృధివి వాయు వాకాశ అగ్ని జలంబులైదుర శిష్యుడా॥ రాజ॥

రామతారక మంత్రమెట్టిదో రమ్యమెరుగను గురువరా స్వామి భక్తులు చదివెతారక ప్రణవమంత్రము శిష్యుడా॥ రాజ॥

మరువకనునే దినము కెన్నిజపించవలె సద్గురువరా యిరువదొక వేలారుపూర్లు జపించు జీవుడు శిష్యుడా॥ రాజ॥

నిజముగ జీవాత్మవంటి నేర్పు తెలియదు గురువరా పూరకము రేచకము తారక మెరిగి నడవర శిష్యుడా॥ రాజ॥

కడపరాళ్ళకుమ్రొక్కితే కర్మంబుతొలగున గురువరా కర్పూరము దీపంబుదర్పణ భావమెరుగర శిష్యుడా॥ రాజ॥

హరియు బ్రహ్మయు యీశుడును త్రిమూర్తులెవ్వరు గురువరా వేరె వేల్పులు లేరురాజ తామసంబులు శిష్యుడా॥ రాజ॥

రంగుగను మూడేర్లుగలనటు సంగతెరుగను గురువరా గంగయు
మున సరస్వతిని బుధులందు రెరుగుమి శిష్యుడా॥ రాజ॥
మెరుపు తెలుపు నలుపులో గురునాధుడెవ్వరు గురువరా ధరను
భక్తులబ్రోచె సద్గురు దైవరాయుడు శిష్యుడా॥ రాజ॥
దిట్టముగ తరచంగ చివరకు వట్టిదాయను గురువరా పుట్టుగిట్టుగు
లేని బట్టబయలు గనరది శిష్యుడా॥ రాజ॥
శ్రమలు పడిపడి తిరిగినందుకు భ్రమలువుడిగెను గురువర సమయ
మిదె నారాయణుని మరుగు చేరుమి శిష్యుడా॥ రాజ॥

౨౨. తత్వము-రాగము-ధన్యాసి-ఆదితాళము

వాడేర గురురాయునిపుత్రుడు వాడేర గురురాయునిపుత్రుడు॥ వా॥
వేడుకతో వేదాంతశ్రవమును జాడతెలిసి భజియించుచుండినా॥ వా॥
పరమభక్తులా పంచచేరుకొని ఆరోహణ అవరోహణమెరిగి ఇరు
వదివక వేలాత్మ జీవునకు తారకమంత్రము తరుచుగ నేర్పిన॥ వా॥
అంటిముట్టు అతిశయములులేక మంటిబొమ్మలో మరుగై యుం
డెనుయింటిలోన పోరంతయునణచి కంటిలోననరకంతునికనుగొన్న॥ వా॥
మనస్సుబుద్ధి అహంకార చిత్తమును తనువు ధనము గురువునకు
తానొసగి యెనుబదినాల్గులక్షకోట్ల యోనులందు యిక పుట్టనిగిట్టని॥ వా॥
పంచవింశతి తత్వము లెప్పుడు యెంచిచూచి యోచించుచుండవలె
సంచితమనె మంచంబుద్రుంచుటకు పంచాక్షరిని పంచిచదివినా॥ వా॥
చెబ్బరగుణములు చీల్చి చెండాడిదబ్బర వేల్పుల దలచక యుండి
మబ్బుయనే మాయను విడగొట్టి నిబ్బరముగ పరమాత్మను గనుగొన్న॥
మండలంబులను మోడుదాటుకొని అండపిండ బ్రహ్మాండంబెరిగి
దండిజీకటి గోనలోపల రెండుబోతులను లెస్సగజూచిన॥ వా॥
కొంగవలెను ధ్యానంబుచేసుకొని పంగనామములు పెట్టితే కలుగు
నాగంగయమునల మధ్యభాగమున సంగమెరిగి సాధించుచుండీన॥ వా॥
వేదశాస్త్రములు వ్యతిరిక్తంబని పాదు తెలియకను బాధలుపడుదు
రుమేదినిలో పీర్ మొహిదీన్ వల్లను బోధలువినుకొనిసాధులచేరిన॥ వా॥
నిత్యానిత్యవివేకము గనుగొని సత్యముచేసితె ఫలముఫలించును
చిత్తముతో నారాయణదాసుడు సత్యజ్ఞానానందము దెలిసిన॥ వా॥

౨౩. తత్వము-రాగము-సురట-ఆదితాళము

యాలనురా గోలనురా కాలునిమాయలో ద్రోయకురాచాలును
యీజన్మమురా జాలము శాయక బ్రోవుమిరా॥ యాల॥

ఉన్నదిరా కన్నదిరా కనుపాపల నడుమను చిన్నదిరా సన్నదిడ్డిలో యున్నదిరా పున్నమవెన్నెలపోలునురా॥ యాల॥

కాయమురా మాయమురా న్యాయముతప్పక నడుపుమురా బాయక శ్రీహరి భజనమురా చేయుము యిలలో నమ్ముమురా॥ యాల॥

అండమురా యుండెనురా పిండములో బ్రహ్మాండమురా పెండితనంబులు కాయకురా ఖండితమేదో కనుగొనరా॥ యాల॥

కొమ్మనురా నమ్మకురా ఇమ్మహిలో చెకువున్నదిరా కమ్మనిమార్గము కనుగొనరా నమ్ముమి తరుణము సుమ్మదిరా॥ యాల॥

మ్రొక్కితిరా దక్కదురా వుక్కు ఇనుపలో హాములనురా నిక్కముగను నీలోపలరా చుక్కలు జూచితే సుఖమారా॥ యాల॥

సాధనరా గాథలురా బోధకుమిక్కిలి లేదనురా గాథలుం యున్నది గనుగొనరా పాదుతో తీసి పారైరా॥ యా॥

యంత్రమురా తంత్రమురా మంత్రమే మూలము గనుగొనరా చింతనచే శోధించుమురా అంతయు మర్మంబందునురా॥ యాల॥

వెరువకురా మరువకురా ధారుణిలో కనకయ్యనురా పరమపదంబుకు మార్గమురా నారాయణదాసుకు దెల్పెనురా॥ యాల॥

౮౩. తత్వము—రాగము—నాదనామక్రియ—ఆదితాళము

శ్రీరామా శ్రీరామా రామాయని రమించుమి రమియించుమి కామక్రోధములు చేరకుండ ధరమల్లించుమి మల్లించూ॥ శ్రీ॥

తల్లితండ్రులకు సేవచేసుకొని సుఖయించుమి సుఖయించూ మల్లి జన్మమిక లేదని భేరి మ్రోగించుమి మ్రోగించూ॥ శ్రీ॥

తొమ్మిది కండ్లది తోలుబొమ్మ దీని నమ్మబోకు నమ్మబోకు యిమ్మహిలోపల వెలసినభక్తుల చెంత చేరి తాకుతాకూ॥ శ్రీ॥

పంచవింశతీ తత్వములెన్నగ పంచిపెట్టు పంచిపెట్టు పొంచిపొంచి అహంకార మృగంబును గట్టిపెట్టు గట్టిపెట్టూ॥ శ్రీ॥

మదపుటేనుగులు ఆరుజోడు నెగ రేసినదుకు మరినదుకూ ముదము తోడ అంతఃకరణాదుల మోసపోకు మోసపోకూ॥ శ్రీ॥

పాపకర్మములు జేసి నరకమున బడపోకుమి తేపతేపకు శ్రీహరి నెప్పుడు మరవకపోకుమి మరవపోకు॥ శ్రీ॥

ఆశపాశముకోసివేసి నల్లకాటిలో పడవైచి గోసిదరియించు దేశము తిరిగితే దోషము తొలగును జైజై॥ శ్రీ॥

రాజయోగమె రమ్యమనుచు నిజరూఢిదెల్పు మది తెల్పు రోజు
రోజు కాయుస్సు తగ్గునని మాయబల్కు మరిబల్కు॥ శ్రీ॥

గురుపదేశంబేల దుర్గుణములు మానకుంటె మానకుంటె నిర
తము దబ్బర లాడినవారికి నిష్టయోగాలకంటె యోగాలుటె॥ శ్రీ॥

పంచవన్నెలా పుష్పములోపల యించిచూడు మరిచూడు అంచిత
ముగ పరంజ్యోతిని కనుగొని మించి వేడు కొనియాడు॥ శ్రీ॥

ధరణిలోన కనకయ్యాగురునకు దాసోహం దాసోహంస్థిరముగాను
నారాయణదాసుడు దేహీ దేహీ దేహీ॥ శ్రీ॥

## ౨౮. తత్వము-రాగము-జాలికాంభోజి-అటతాళము

మెఱుగరయ్యా బ్రహ్మం మెఱుగరయ్యా అజ్ఞానమూఢులు॥ మె॥

మెఱుగలేకను బ్రహ్మమహిమను తిరుగుచుందురు నదులనిధులకు
స్థిరముగా భ్రూమధ్యమున మదినినిల్పి ఆపోజ్యోతి బ్రహ్మం॥ మెఱు॥

అర్పితంబని వారికి సెప్పుడు ఖర్మకాండము చేయుచుందురు కర్పు
రదీపంబు దర్పణ భావమెరిగితె భ్రమలువిడునని॥ మెఱు॥

ఉన్నవూరును విడిచిపెట్టి వచ్చితిమి పొన్నూరుకిప్పుడు తిన్నగా
కొన్నాళ్లు జరిగిన పిమ్మటను మొదటుండెవూరు॥ మెఱు॥

ధరణిలో తద్దాసులగుటయు డంభముగ ధరియించుకొందురు పర
మభక్తులు సద్దులేకను పంచలోబడి యుందురనిమది॥ మెఱు॥

చిలుకవలె శ్రీరామరామని పలికితే ఫలమేమికద్దుర పిల్లిచిలుకను
బట్టినప్పుడు తొల్లిచదివిన చదువుగురుతు॥ మెఱు॥

హద్దుతెలియక ఆత్మరాముడె పాపపుణ్యము చేసెనందురు బుద్ధి
తక్కువచేతనే దుర్బుద్ధులన్ని చెల్లించునను మది॥ మెఱు॥

యీషణత్రయాదు లందున యిముడుకొని బొర్లాడు చుందురు
దోషము లేకుండ రాముల లేశమైనను తలచెమార్గం॥ మెఱు॥

వినయముతో భువిలోన పీర్ మొహిదీను చెప్పినపల్కు వినుడి
తనువువిడిచి పొయ్యేటప్పుడు భయమెందుకు గలుగునని మది॥ మెఱు॥

## ౨౯. తత్వము-రాగము-రేగుప్తి-అటతాళము

సంశయబడబోకె మనసా పరమహంసలొద్దకు జేరు మనసా హిం
సలన్నియు బాసుటకు వుపాయం బెరిగి హంస ధ్యానాతు రనుభవము
జేసి తెచాలు॥ సంశయ॥

యేడుకొండలపైని మనసా మంచి జోడుతుమ్మెదటుండు మనసా వేడుకతో వ్యాఘ్రములనంటితయముచు రాగజాడగని చిలుకలన్నియు మోదమొందెనట॥ సంశయ॥

మూటినిగనవలెను మనసా కనియుయేటికెదురుర నడుమి మనసా నేర్పైనరామనామము నావగాజేసి దాటియావల నొక్కనాతి గనుపడును యటా॥ సంశయ॥

సారమేమియులేదు మనసా సంసారకడలిని దాటుమనసా పూరకము రేచకము పుట్టుగిట్టుట స్థలము బాగుగ నుంచె భవబంధములు తొలగునట॥ సంశయ॥

తప్పునడతలు నడువకుము మనసా వెనుక తిప్పలున్నవి చూడు మనసా చప్పుడేమియు కాయకుండే చొప్పుణగుండి కప్ప వక్కటి పాము లైదు దిగమ్రింగెనట॥ సంశయ॥

తనకుతా కనవలెను మనసా తిరిగి వెనుక జన్మములేదు మనసా తనువనెడి పట్టణమునకు మనసా రాజువై ఘన యింద్రియంబులు బంటులై చెలగెనట॥ సంశయ॥

నాదినీదని నీకు మనసా వాదబేధ మేలను మాయ మనసా మేదినిలో కనకయ్య దాసుని దయవల్ల బోధకని నారాయణ దాసుడయ్యెనట॥ సంశయ॥

## ౫౦. తత్వము-రాగము-నాదనామక్రియ-ఏకతాళము

శ్రీరామా యనుమా జీవామా పరంధాముని భజియించి పదవి గనుగొనుమా॥ శ్రీ॥

శతసంవత్సరములు మితమా ముందూగతి కనిపెట్టి చెప్పుట నీకు తరమా క్షితి మాయామని యనుకొనుమా సతిసుతులెల్ల కాళ్ళసంకెళ్ళనుకొనుమా॥ శ్రీ॥

తల్లిగర్భమునందుబుట్టి తొల్లి జేసినకర్తలన్నియు డల్లగొల్లి మల్లి జన్మములేదు గట్టినీవు వెళ్ళిపొయ్యేటప్పు డిరుగావు ముక్తి॥ శ్రీ॥

కాయమెప్పుడు నమ్మబోకూ యీమాయప్రపంచము మరచిన నీకూ న్యాయమైనా త్రోవదొరకూ ఘన సాయుజ్యపదవి సమకూడును నీకూ॥ శ్రీ॥

సంసారబంధముగోసీ హంసద్వయాక్షర అనుభవముజేసి సంశలన్నియు తెగగోసీ నీలో హంసోహంప్రణవమెప్పుడునూ ఆలించి॥ శ్రీ॥

అంతూ తెలియలేక మనమూ మన చెంతనున్న పరమాత్మ గన లేమూ పంతమెప్పుడు బలికేమూ యితర చింతాలు విడిచితే చెంతా జేరేమో॥ శ్రీ॥

యేడు కొండలు మీదనున్నది జూడు యీడపింగళమధ్య వివర మెరుగన్నా వేదాకృతో చిన్నదన్నా దాన్నిగూడితె ముక్తికి మార్గా మురన్నా॥ శ్రీ॥

స్థిరమతితో ధ్యానించావే యిల ధర పీర్ మొహిదీన్‌కు సలాం కర్ కర్ జావే పరమ పదంబుకు త్రోవే గుజ్జుల నారాయణ దాసుని నమ్మియుండావే॥ శ్రీరామ॥

౫౧. తత్త్వము-రాగము-నాదనామక్రియ-అటతాళము

భజన యెట్టిదో తెలియర నిజము గనుగొని నడవర అజుడు వ్రాసిన వ్రాత కొలదిగ సుజనులకు విదిచిక్కర॥ భ॥

పంచభూతములైదురా ప్రపంచరూపము లాయెకాకొంచపరచక నీవు యీపంచాక్షరిని పఠియించరా॥ భ॥

ఇంటిలోపల పోరురా కలికంటికనబడదేమిరా వెంటనున్నదొంగ లార్గురు మంటలో పడిమండెరా॥ భ॥

దృఢముగను గమనించి జాడగనుగొని చూడరా యేడుమేడల పైనియొక్క ఆడుదున్నది యెరుగరా॥ భ॥

గంగయమునల నడుమరా సంగమున్నది చూడరా సంగములో స్నానంబుజేసితె లింగరూపము నీవెర॥ భ॥

నక్కవక్కటియుండెరా కుక్కలను మొగదోలెరా చిక్కలేకను చీమముఖరిని నిక్కముగ దిగమ్రింగెరా॥ భ॥

గొప్పపాములు అయిదురా కప్పవకటిని జూచెరా చప్పుడేమియు కాయకుండగ నిప్పులోబడి చచ్చెరా॥ భ॥

ఈగవక్కటిజూచెరా వేగమంచము మ్రింగెరా జాగుకాయక మర్కటంబులు రోగములు తెగగోసెర॥ భ॥

కరువుడీరగ దొరికెరా ధరణిలో కనకయ్యరా దురితములు తెగ గోసెర నారాయణుని దరిజేరరా॥ భ॥

౫౨. తత్త్వము-రాగము-పున్నాగ-ఆదితాళము

అయ్యో నేమోసబోతీ సోహం సోహం బనకను॥ అ॥

మాయప్రపంచము నమ్మితీ యిలకాయము స్థిరమని దలచితీ న్యాయ మార్గములు విడిచితి గురురాయుని పూజలు మరచితినే॥ అ॥

తలిదండ్రుల పూజింపగానే ఆలిని క్షణమున విడువక గ్రోలుచు
నుంటిని సుఖముగా నెల్లకాలము గడిపితి రీతిగా॥ అ॥

ధనధాన్యం బాసించితి యిల తనయులగని కాపాడితి బెనగుచు
స్త్రీలతో గూడితి నామనమున రాముని మరచితినే॥ అ॥

ఈషణాత్రయములు విడువకానే దోషములకు నడిగట్టుకా వేష
భాషలును నేర్చుకా నుపదేశము లేకను చెడితికా॥ అ॥

సర్వలోక మార్గంబునూ యీదుర్గుణములు తొలగించెనూ భార్గవ
రాముని గనకనూ యీ అర్థము దొంగలచేత జిక్కెనూ॥ అ॥

దాస దాసులకు మ్రొక్కకా శ్రీ వాసుదేవుని దలచకా జేసిన
పాపము తొలుగకా పెద్దదాసువలెను తిరుగకా॥ అ॥

దారుణిలో కనకయ్యనూ మరచిచెడెను నారాయణు మరుగు
పదంబులు నాల్గునూ వాటి మర్మము తెలియని చేతనూనే॥ అ॥

౨౩. తత్వము-రాగము-నామావళి-ఆదితాళము

ఓం నమశ్శివాయనియనుమా ప్రణవాక్షరా బీజముగనుమా॥ ఓం॥
అయిదక్షరములుసుమ్మా యిరువైయైదు పంచి చదువుమా॥ ఓం॥
మూడుమూడు అరిడచీ మూడేసుల మధ్యను నిలచీ॥ ఓం॥
కామక్రోధములు గట్టి కాలయమునికి నామము బెట్టి॥ ఓం॥
నిత్యంబని యెంచకుమా అసత్య ప్రపంచము సుమ్మా॥ ఓం॥
తారక మంత్రముబాటా నారాయణదాసుని పేటా॥ ఓం॥

౨౪. తత్వము-రాగము-నాదనామక్రియ-ఆదితాళము

పతివ్రత యెప్పుడు పతిపాదంబులు బూజించినదే ఆడదీ పతినివిడచి
పరపురుషుల వెంబడి పరుగులెత్తినదే గాడిదీ॥ పతి॥
అత్తమామలను ఆదరించుకొని పొత్తుగ తిరిగినదాడదీ విత్తనమంతయు
చేతబట్టి పెత్తనముజేసినదే గాడిదీ॥' పతి॥
వచ్చిపొయ్యే చుట్టాలనెల్ల సంతోషించినదే ఆడదీ కుత్సిత గుణములు
మదిలో నుంచక తత్తరపడినదే గాడిదీ॥ పతి॥
బావమరదులు యున్నను భక్తితో చూచుచున్నదే ఆడదీ కావరగుణ
ములు విడువలేక పామరము జెందినదే గాడిదీ॥ పతి॥
గడచి గడియకుండిన సంసారము గడుపుకున్నదే ఆడదీ జడియకుండ తన
భర్తను తెమ్మని సాధించినదే గాడిదీ॥ పతి॥
తీరుగాను తనభర్త దేవుడని భావించినదే ఆడదీ ఘోరమైన సంసార
ములోబడి దారికానినదే గాడిదీ॥ పతి॥

పుంగవులను బూజించి దేహాక్షణబంగుర విపన్న దే ఆడదీ అంగడి బేరము
జేయుచు దుష్టుల సంగతె త్తినదే గాడిదీ॥ పతి॥
మూడువిడచి మూడాడనురోసి మూలమెరిగినదే ఆడదీ జోడు గుఱ్ఱమిూ
దుండిన గూటను జాడ తెలియనిదే గాడిదీ॥ పతి॥
ధరణిలోన నారాయణదాసుని హృదయమెరిగినదే ఆడదీ గురుమంత్రం
బనె గొడ్డలిచే దుర్గుణములు నరకనిదే గాడిదీ॥ పతి॥

౫౫. తత్వము—రాగము—నాదనామక్రియ—ఆదితాళము

ఇలతలిదండ్రులు తొలిదైవంబని తలచినవాడే పుత్రుడూ కలిమి బలిమి
గలదనియు బడాయిజేసినవాడే శత్రుడూ॥ ఇ॥
ధనధాన్యంబులు తెచ్చికుటుంబము జరిపినవాడే పుత్రుడూ వినయములే
కను యితరులతో పోరాడినవాడే శత్రుడూ॥ ఇ॥
ఆలితోను సంసారము జేసి యేలినవాడే పుత్రుడూ కాలముగలపరస్త్రీల
తోను భోగించినవాడే శత్రుడూ॥ ఇ॥
పెద్దలుసేవయు జేసి సమిష్టిగనుండినవాడే పుత్రుడూ హద్దు తెలియకను
పెద్దలతో వాదించినవాడే శత్రుడూ॥ ఇ॥
పంచవింశతి తత్వములన్నియు యోచించినవాడే పుత్రుడూ కొంచము
లో మూడాశలు మొకటికి త్రుంచనివాడే శత్రుడూ॥ ఇ॥
ఎందుకొచ్చె నరజన్మంబని మొరబెట్టినవాడే పుత్రుడూ అందరిలో అప
కీర్తిదెచ్చి దుఃఖించినవాడే శత్రుడూ॥ ఇ॥
అష్టమదంబులు గొట్టి అర్జునని కట్టినవాడే పుత్రుడూ ఇష్టముతో శ్రీ
విష్ణుదేవుని వేడనివాడే శత్రుడూ॥ ఇ॥
యెరుపు తెలుపు నలుపులో గురురాయుని నెరిగినవాడే పుత్రుడూ నర
శల్యంబుల దేహము స్థిరమని నమ్మినవాడే శత్రుడూ॥ ఇ॥
యోగమనగ నెట్టిదో వివరంబుగ దెలిసినవాడే పుత్రుడు బాగుగాను
నారాయణభావము నెరుగనివాడే శత్రుడూ॥ ఇ॥

౫౬. తత్వము—రాగము — మోహన—ఆదితాళము

మాయబొమ్మనీ సద్గురురాయుడు మర్మము దెల్పినదూ॥
కాములో నుపాయమెరిగి పరమాత్మని గనుమన్నదూ॥ మా॥
బాయకుండ హరిషడ్వర్గములను బంగపెట్టుమన్నదూ,
న్యాయముగా అంతఃకరణాదుల హతము చేయుమన్నదూ॥ మా॥
వాయువగ్నిజల పృథివితో గూడిన స్థూలదేహమన్నదూ,
మదపు ఏనుగులు ఆరుజోడు నెగరేసి నడుముమన్నదూ॥ మా॥

విదితముగా మూఢాశలు మొదటికి గోసివేయుమన్నడూ,
గాశలు చెప్పని బోధగురువులా చెంత జేరు మన్నడూ॥ మా॥
చదువులేక పోయివున్నను సాధించవచ్చు నన్నడూ,
అధముడుగనుటకు అలవిగాదు హృదయంబులోపలన్నడూ॥ మా॥
తొల్లి చేసినా పాపకర్మములు దుల్లగొట్టు మన్నడూ,
తల్లితండ్రుతే తొలిదైవంబని దలచుచుండు మన్నడూ॥ మా॥
మళ్ళిజన్మమిక లేదని తారక మంత్రమిచ్చినాడూ,
యుల్లములో జీవాత్మతోను జపియించుచుండుమన్నడూ॥ మా॥
తలచిన రాముడు తనలోనుండగ తిరగనేల నన్నడూ,
పాత్రాపాత్రగని దానధర్మములు జేయుచుండుమన్నడూ॥ మా॥
గోత్రకులము లన్నియు లేకను తెగగోసి వేయుమన్నడూ,
యాత్ర లెన్ని తిరిగి ప్రారబ్ధము విడువబోదు మన్నడూ॥ మా॥
నేత్రద్వారమున సూత్రదారుని జూచి మ్రొక్కుమన్నడూ,
రాత్రిపగలు అనకుండ జరిగె జపంబు చేయుమన్నడూ॥ మా॥
కర్పరాళ్ళకు మ్రొక్కి తెకర్మం బిడువబోదునన్నడూ,
కర్పూరదీపముదర్పణ భావముదారిజూపి నడువామన్నడూ॥ మా॥
నేర్పుతోడ నేత్రంబులు రెండొకటి జేయుమన్నడూ,
ఓర్పుతోడ నడినాళములో పరంజ్యోతినెరుగ మన్నడూ॥ మా॥
అర్పితంబని యీతనువు గురునికీ దారబోయ్యి మన్నడూ,
గురుపదేశం బియ్యకముందే గుణముజూడుమన్నడూ॥ మా॥
పరమ రహస్యంబును కొందరు తిరుగుచుండి రన్నడూ,
నరకము లోబడి పోతిమనును గతి కానరేమి రన్నడూ॥ మా॥
గురుమూర్తికి గురుకట్నంబిచ్చి గురుతు యెరుగ మన్నడూ,
ధరణిలోపల పీర్ మొహిదీన్ కెప్పుడుశరణు జేయుమన్నడూ॥ మా॥

### ౫౨. తత్త్వము-రాగము-యదుకులకాంభోజి-అటతాళము

కంటికమలమునందు కాశీవిశ్వేశ్వరుని గన్నవాడే బోధ గురువే గదా వెంటనున్నటువంటి దొంగలార్గురితో గూడి అంటితిరిగిన బాధ గురువేకదా॥ కంటి॥

నామనీనామమునిష్టలేని పరమాత్మను నెరిగి మ్రొక్కిన బోధగురువే గదా రామతారక మంత్ర రహస్యమమ్మా పొట్టగడుపుచుండిన బాధ గురువేగదా॥ కంటి॥

కప్పచేతను అయిదుపాములను క్రుంగి చప్పరించిన బోధ గురువేగదా నిప్పుమీదను నిదురగప్పినట్లుండగను గొప్పచెప్పిన బాధ గురువేగదా॥ కంటి॥

నిత్యానిత్యముల నెరిగి ప్రపంచ మనిత్యంబనినా బోధ గురువే గదా సత్యాసత్యము రెండు దప్పకుండగ బోధ చేయుచుండిన బాధగురు వేగదా॥ కంటి॥

అష్టమదములనెల్ల చీమాచేతను త్రొక్కిపెట్టియుంచిన బోధగురు వేగదా సృష్టిపుట్టకముందు పుట్టియుండిన బ్రహ్మ మెరుగకుండిన బాధ గురువేగదా॥ కంటి॥

గంగయమునల నడుమాను సంగములో స్నానంబు జేయుచుండిన బాధగురువేగదా పంగనామాలు పెట్టి పరమభక్తులనుచు చాటితిరిగిన బాధగురువేగదా॥ కంటి॥

సాంఖ్య సూత్రము తారమనస్క భావమును చక్కబెట్టిన బోధ గురువేగదా శంకలేకను మంచి చెడ్డయెరుగక పనులు చేయుచుండిన బాధగురువేకదా॥ కంటి॥

షట్చక్రములమీద నడిచె హంసతో జపము చేయుచుండిన బోధ గురువేగదా మెడను రుద్రాక్షలు జడలు శిఖలేని జగదీశు నెరుగని బాధగురువేగదా॥ కంటి॥

పూరకము రేచకము పుట్టుగిట్టుట స్థలము పురము యెరిగిన బోధ గురువేగదా ధరణిలోనుండకను మరణమొందదనుచు భీతినొందినబాధ గురువేకదా॥ కంటి॥

యెరుపు తెలుపు నలుపులోన నీలంబులలో లీలగనినా బోధగురు వేగదా ధరను పీర్ మొహిద్దీను చెప్పినని కటినముగ వగచుచుండిన బాధగురువేగదా॥ కంటి॥

## ౫౮. తత్త్వము—శ్రీరాగము—ఆదితాళము

అన్ని మంత్రముల వంటిదిగాదమ్మా గురురాయుని మంత్రముకన్న నూ భువిలో వెతకిన లేదమ్మా మున్ను వాల్మీకాదు లెరిగియుండిరా వైకుంఠపురములో॥ అన్ని॥

ప్రేమతో జీవాత్మదెపుడూ సుమ్మా షట్చక్రములందున వేమా రక జపియించుచు నుండమ్మా యీ మహాత్మ్య మెరిగేవారి కంటినా అరిషడ్వర్గములు॥ అన్ని॥

భూతపిశాచములు చేరవమ్మా భువిలోన కఫవాతపైత్యములకు మంచిదిసుమ్మా సప్తకోటి మంత్రములకు మించుచున్న పరమహంస జపమిది॥ అన్ని॥

చింతలూ యడబాసి పోవునమ్మా మదిలో నెప్పుడు సంతోషము తో వెలుగుచుండు నమ్మా అతి యింతనరాని దెప్పు డంతు లేకా నందము జేసేది॥ అన్ని॥

తిన్నినీ గురుబోధకంటే నమ్మావున్నట్టు వంటస్థంబన్ని నీకగోచ రమోసుమ్మమ్మా యున్నదూ విని కన లేనిదున్నదా హాశ్చర్యమైనది॥ అన్ని॥

ధరణిలో దొరుకుట దుర్లభమ్మా సద్ బుధులూ గూడి తర చీన పంచామృతమది సుమ్మా గురునీవద్ద గుప్తమైయున్నదా గురు రహాస్యమైనది॥ అన్ని॥

వాసిగాకృషి జేయవలెనమ్మా కనకయ్యాగురుని ఆశ్రయించి తేను దొరుకునమ్మా భాసురముగ నారాయణదాసుడై దలచుచుండిన॥ అన్ని॥

౫౯. తత్వము—రాగము—నాదనామక్రియ—ఆదితాళము

ఓం – ఓం – ఓం – ఓం – ఓం – నమశ్శివాయ యనుమా దేవ॥ ఓం॥

పంచాక్షరి పారాయణ జేసితె పంచపాతకము లుడుగుకా వంచన లేకను యేగురుడైనను పంచితె పరమాత్మగునకా మది సంశయములు తేగిపోవుకా అనుదిన మానందముగలుగుకా భవబంధములన్ని వీడిపోవుకా మనకుకా॥ ఓం॥

మాయ ప్రపంచముజూచి నిత్యమని నీవు భ్రమలు జెందకుమా యీ కాయము నిత్యముగాదు సుమ్మి వుపాయము గురునిచే కనుమా పరమాత్మని శోధించాము పరస్త్రీలను మదిగోరకుమా యెప్పుడు హరి హరిహరి యను మనుదినమూ॥ ఓం॥

దుష్టజనుల సాంగత్యముచేసితే కష్టమధిక మగుచుండూ అష్ట మదంబులు అణచిపెట్టి గురయిష్టభావమున నుండూ మూడీమణత్రయ ములు చెందూ కనువాపల జ్యోతులటుండూ కనుగొంటె నీకు మేలుండు మెండూ॥ ఓం॥

హరిషడ్వర్గము లార్గురు నిన్నూ అంటనివ్వకూ సుమ్మీ తారక మంత్ర ప్రభావముచేతను తరిమి తరిమి గొట్టుమీ కనికర మెంతయు వుంచకుమీ బహుదుష్టులను నమ్మకుమీ హరిష్టముతో తిరుగకుమీ నమ్మీ॥ ఓం॥

కాటుక పక్షులు కదలకుండగను తెరచి చూడవలెనన్నా కోటి భానులా తేజము కనబడు చూడ జూడగా నన్నా మూడేరుల మధ్యను కన్నా అవతలిలో మోక్షం బన్నా దర్పణ భావము జూడన్న కన్నా॥ ఓం॥

దాసదాస తద్దాసదాసులకు దాసుడవని మొరపెట్టు భాసుర ముని నారాయణయని తలచితె రాదు యమబాధనీకెట్టూ గురూపదేశ ములో గట్టూ నీవదలకుండకని పెట్టూ నేమరువక నీవొట్టుబెట్టూ॥ ఓం॥

౨౦. తత్వము – రాగము – నాదనామక్రియ – ఆదితాళము

నారాయణనారాయణమంత్రము నమ్మి భజించుభజించుశ్రీమాన్ నారాయణ మంత్రము పారాయణజేసి సుఖించు సుఖించూ॥ నా॥

భక్తితోను గురుసేవచేసి గుణములు మూడిడుమూడిడు యీ శక్తిమాయలకు లోబడకుండగ ముక్తికొరకు వేడెడూ వేడెడు॥ నా॥

పంచముద్రలను పట్టువిడుపులు శోధించుచు శోధించుచూ వంచన లేకను ఓంనమశ్శివాయ తలంచు తలంచూ॥ నా॥

ముందు చేసినా పాపములకు దుఃఖించుచు నీవు దుఃఖించుచూ ఈ బొందిలోన దుర్గుణము లన్నింటిని బంధించుచు బంధించుచూ॥ నా॥

దాసులై తే విధి నదులు తిరుగుటా యేలనయ్యా యేలనయ్యా కాశితీర్థము కన్నులనున్నది జూడరయ్యా జూడరయ్యా॥ నా॥

భ్రమలుచేత కొందఱు భ్రష్టయ్యేరు భువిలోన భువిలోనా శమ ము దమము ఉపరతి తితిక్షణముగను లోన నీలోనా॥ నా॥

నీలతోయదా మధ్యమందు నిదానించు నిదానించూ వాలలాడిన వరగురుమూర్తిని సేవించుమి సేవించు॥ నా॥

వాసిగాను ధవళేశ్వర పురమున వాసమంటి నివాసమంటి దోసి లొగ్గి నారాయణధాసుడు శరణంటిని శరణంటీ॥ నా॥

౨౧. తత్వము – రాగము – నామావళి – ఆదితాళము

సోహం సోహంబనుజీవా యీ మోహవార్ధిలోబడి చెడిపోకా॥ సో॥
షట్చక్రంబులమీదను నడుచుచు తారకమంత్రము చదువుచు॥ సో॥
స్థూలసూక్ష్మ దేహంబులలో కాలము గడపక కీలు గనుంగొను॥ సో॥
రంగుల బొమ్మదినమ్మకుతా భంగమయ్యే క్షణభంగుర దేహము॥ సో॥
మనసుబుద్ధి హంకారమునూ ఈతనువుధనము గురునకుదారొసగిన॥ సో॥
అరిషడ్వర్గము లంకటనూ తారక మంత్రముచే తరుముచును॥ సో॥
ధారుణిలో నారాయణుని ధీరుడవై దరిజేర్చుట కెపుడు॥ సో॥

౭౨. తత్వము - రాగము - తోడి - రూపకతాళము

సత్యమే బ్రహ్మం అసత్యమే కాయం మాయం॥

నిత్యానిత్యములను నెరిగి ప్రపంచ మనిత్యమని నిజబోధకంటె చాలు॥ స॥

శత్రులార్గురితో నెప్పుడు చెలిమిచేసి చెడిపోవ్వే వే మనస పుత్రీషణ ధారాధనేషణ ధాత్రిలోపల దారబోసి సద్గురునికి నేత్రద్వారమునున్న సూత్రాధారుని గనిస్తోత్ర మెప్పుడు చేయుచున్న నారాయణా॥స॥

౭౩. తత్వము - రాగము - ఆనందభైరవి - అటతాళము

మంచిసమయమిది మించిపోతే రోరన్నయ్యా లేక కాలయముడు ఖండించును సుమ్మోరన్నయ్యా॥ మం॥

పంచాక్షరీమంత్రము కీలెరుగోరన్నయ్యా నీవు పంచి చదివితేపల మున్నదిరో రన్నయ్యా మం॥

మధ్యచ్రక్రంబులమీద హంసతో నన్నయ్యా నీవు విడువకుండ పఠియించుచు నుండురో రన్నయ్యా॥ మం॥

అకార ఉకార మకారములురోరన్నయ్యా ఓంకార ప్రణవనాదం బాయను రోరన్నయ్యా॥ మం॥

నవతత్వాజల కోటలోపల రన్నయ్యా దేవవాదములు మ్రోగుచున్నవోరన్నయ్యా॥ మం॥

వినవలెనని అభిలాషవుంటెనో రన్నయ్యా నీవు కన్న గురువుల చెంత చేరకురో రన్నయ్యా మం॥

యింటిలోన పోరంతయు నణచోరన్నయ్యా కంటిలోన నలుపున్నది చూడ్రో రన్నయ్యా॥ మం॥

గంగాయమునా సరస్వతీ నడుమా రన్నయ్యా సంగములో శివలింగమున్నడో రన్నయ్యా॥ మం॥

మూడుదినంబులు ముచ్చటలిదిగో రన్నయ్యా విడువకు నారాయణదాసుని రోరన్నయ్యా॥ మం॥

౭౪. తత్వము - రాగము - శుద్ధకాంభోజి-అటతాళము

రామ బ్రహ్మనందమురా అతిప్రేమతోడుత కని కొనియాడుకోరా॥ రా॥

పంచవింశతత్వం పరిశోధించుమిరా పంచాక్షరీమంత్రం పంచి చదువుమిరా॥ రా॥

మదగజములు నిన్నూ బట్టి చంపునురా పదిలముగ వాటిని పడద్రోసి కనరా॥ రా॥

కపవాత పైత్యముల్ గప్పినప్పుడురా వుపదేశ వాఖ్యాము విన లేవు పోరా॥ రా॥

అల ఇంద్రాదులకైనా అలవి గానిదిరా భజన చేయుచు భయ భక్తితో గనరా॥ రా॥

వన్నె కెక్కిన పూల వనముదాటియురా సన్న దిడ్డిలోదూరి పారిపోవలెరా॥ రా॥

అరు చక్రాలకు ఆనవాలున్నదిరా మేరు శిఖరముపై మేడ లోపలరా॥ రా॥

గంగయమున నదులు అడ్డమున్నవిరా దొంగ లార్గురి గొట్టి దాటిపోవలెరా॥ రా॥

విరివిగ కనకయ్య గురుని కృపగనురా ధననారాయణస్వామి వాసూడయ్యెనురా॥ రా॥

౨౫. తత్వము - రాగము - అరభి - ఆదితాళము

వెళ్ళిపోయ్యేటప్పు డెంటా నెవ్వరుతోడు రారూ నమ్ముమి జీవమా జీవాతోడు॥ వె॥

ఆలుపిల్లలుగూడి యధికాదుఃఖించినా అగ్నిపాలుగాక యుండునా జీవా నీవు॥ వె॥

తల్లితండ్రులుకనిపెట్టిపెంచినతనువుకల్లనినమ్ముకొమ్మిజీవానీవు॥ వె॥

నీవు యుండిన యిల్లు నిత్యమనుకొన్నావా అనిత్యామని నమ్మరా జీవా నీవు॥ వె॥

తనువు నిత్యముగాదు ధనము వెంటనెరాదు పాపపుణ్య కర్మము వచ్చురా జీవా నీవు॥ వె॥

కాల యెమునికొరకు చాలా శ్రమపడి గురుకీలు దెలుసుకొనరా జీవా నీవు॥ వె॥

ఆరునిధులపైని యేక భావముగాను ఆడి పాడుచు నుండరా జీవా నీవు॥ వె॥

కపవాతపైత్యముల్ గప్పినప్పుడు వుపదేశవాక్యము బల్కుమా జీవా నీవు॥ వె॥

యెన్నాళ్లో బ్రతికినా కొన్నాళ్ళ కేఘటమూ కాటిపాలై పోవురా జీవా నీవు॥ వె॥

మలమూత్రములు రక్తమాంసా దేహాముసమ్మి మఱలుకోనుం డాకుమి జీవా నీవు॥ వె॥

ధరణిలో కనకయ్య దాస గురువునకు దాస నారాయణరా
జీవా నీవు॥ వె॥

౬౬. తత్త్వము - రాగము - ఆరభి - అటతాళము

యెందుకొచ్చి చిక్కితే జీవమా బొంది నిశ్చయము గాదు సుమ్మా॥
బొందివంటి దేహము నమ్మిరమ్మా ముందనేకులు మోసపొయ్యేరమ్మా

ఆలిపిల్లా లెందరు గలిగున్నా కాలసంకిళ్ళ నమ్ముకోరన్నా కాల
మొచ్చిపొయ్యేటప్పుడన్నా యాలజప్పేరు యెవరు రారన్నా॥ యెం॥

మూత్రకొంపలోపల నుండాకు చీచీ హితవు యెట్లయ్యెను నీకూ
వాతపైత్యమనుభవించుటాకు దాతవ్రాసేనూ కాబోలునీకూ॥ యెం॥

నవరత్నాజలమరీన బొమ్మా అవయవము లేర్పరచేటి బ్రహ్మా
నీవు వివరము దెలుసుకొమ్మా క్రొవ్వుమాంసములపై చర్మము
సుమ్మా॥ యెం॥

ఘటములో నీవు యున్నంతవరకే పటుతరముగ నుండంతవరకే
తటుక్కునా వెళ్ళిపోయినవెనుకే మటుమాయమైపోవు కనబడకే॥ యెం॥

ధరణిలోను ధవళగిరిలోన గురుని కృపనుపొంది నారాయణా
మరువకానుధ్యానించుమీలోనాపరమునకు జేరెదవు బిరానా॥ యెం॥

౬౭. తత్త్వము - రాగము - నాదనామక్రియ - ఆదితాళము

మోసపోక వినుడీ మన వాసుదేవ కృపగనుడీ॥ మో॥

రాగముచే పరస్త్రీలతో గూడీ రావణుండు రణమందు
జచ్చెను॥ మో॥

అపకారమునకు ప్రతి అపకారము ద్వేషముంచి హిరణ్యుడు
జచ్చెను॥ మో॥

ధన ధాన్యంబులు కూర్చెదనని కామంబున నరకాసురుడు
గతించెను॥ మో॥

తన పదార్థమున కితరులు యోర్వక క్రోధమున బకాసురుడు
జచ్చెను॥ మో॥

తన ద్రవ్యములో తృణము యివ్వనని లోబమున దుర్యోధనుడు
నశించెను॥ మో॥

తన పదార్థ మతి ప్రీతిగాజూచి మోహముచే దశరథుడు
గూలెను॥ మో॥

మదముచేత తెలియకగర్వించి కార్త్యవీర్యార్జునుడుగిట్టెను॥ మో॥

మాత్సర్యముచే తనకంటెచ్చని వోర్వలేక శిశుపాలకుడెల్లిరి॥ మో॥

తనదుఃఖము యితరులకు గలుగునని యీర్ష్యవల్ల అరుణాత్ముడు జచ్చెను॥ మో॥

తన సుఖములకు రావద్దని పౌండికవాసుదేవుడు గూలెను॥ మో॥

తాజేసిన పుణ్యము మెచ్చుదురని దంభమునా అంబరీషుడు జచ్చెను॥ మో॥

నేనే పెద్ద నాకన్న లేరని శతకంఠ రావణుడు గతించెను॥ మో॥

నే బెట్టిన కార్యము విడువానని మధుకైటంబుల మరణము నొందిరి॥ మో॥

రంగుగాను నారాయణదాసుడు రాగద్వేషముల మహిమను జెప్పెను॥ మో॥

౭౮. తత్వము-రాగము-నాదనామక్రియ-ఆదితాళం

లేదు లేదుసుమీ యిందూన మోక్షము। లే।
నీళ్ళలోమునిగిన పక్షివలెను హృదయంస్నానంబులు చేసినగానీ। లే।
తెల్లగుమ్మిడిపండువలెను దేహమునకు భస్మం బూసినగానీ। లే।
కాయలుకాచిన రేగుకాయలు రుద్రాక్షలు ధరియించినగానీ। లే।
బకమువలెను పంక్తిపంక్తిగాను ద్వాదశనామము దిద్దినగానీ। లే।
కోసిన కాకరకాయవలె దేహమునకు ముద్రలు వేసినగానీ। లే।
పండిన వెదురాకువలెను గోపిచందన మలకరించినగానీ। లే।
యేనుగుజల్లిన నీళ్లువలెను హస్తాముతో అర్ఘ్యమిడిచినగానీ। లే।
వరషాకాలముగూసె కప్పవలె దినము తేవారము పాడినగానీ। లే।
అడవిలోమేశే పశువువలెను కందమూలములు దిన్ననుగానీ। లే।
చలనములేనికొండపామువలెనువక్కచోటపడియున్ననుగానీ॥ లే॥
బొక్కలోయున్న పందికుక్కవలె గృహములోపలదాగున్నగానీ।
మట్టిపూడవలె తలవెంట్రుకలు జడలుదాల్చి శిఖవేసినగానీ। లే।
మానిప్రతిమవలె ఆధారంబులేక మౌనముగ యున్ననుగాని। లే।
అడవిలోతిరిగిన మృగరాజువలె దేశదేశములు తిరిగినగానీ। లే।
ధరణిలోన పీర్ మోహిద్దీన్ మాటలువినక వైరాగ్యము యుంటెనుగానీ। లే।

౭౯. తత్వము-రాగము-పంతువరాళి-అటతాళం

నీకేమిభయమే మానస కనునీవేబ్రహ్మమే యేమిభయమిక ఏమిభయమిక ఆరునిధులపైనున్న వెనుకా గుమ్ముగుమ్మని నాదములు మ్రోగించే బాధలతో గూడవెనుకా॥ నీ॥

కాదుకూతలు మానిమూడు కాలువల మధ్యంబుకీలూ నేదుపున సద్గురుని చేత నెరిగి ఆనందించవెనుకా॥ నీ॥

కండలూ యెముకాలు కాయము కుండవంటి దానినమ్మము డండిగల మదగజము నెక్కి మెండుగా గూర్చున్న వెనుకా॥ నీ॥

వేదశాస్త్ర పురాణకావల మీదనుండె బోధ తేలిసితే నాదబ్రహ్మానంద మేజ గజ్యోతిమై వెల్గుచుండగ॥ నీ॥

భామలా మాయలో బడి కాముని వలలోను చిక్కిన రామనామము యిదువదొక వెయ్యారుమార్లు రమించవెనుకా॥ నీ॥

కన్నగుదువుల చేత గనుగొని కన్నులా మధ్యంబునున్న సన్నపు దిడ్డిలో నీవుదూరి వున్న వెన్నెలజూచె వెనుకా! నీ॥

కాయమెప్పుడు నమ్మపోకుము మాయాసరికే మర్మమెరుగుము న్యాయముగ నారాయణు గురురాయుని ధ్యానించె వెనుకా॥ నీ॥

## ౨౦. తత్త్వము–రాగము–పరజ–అటతాళము

కాయమా మాయమైపొయ్యేశరీరమా బాయక నిడదీయుమీ సంశయమువిడచి న్యాయమువిడువాకు మీప్రపంచాము మాయమని మది నమ్ముమీ సులభము కటిన సాయుజ్య పద వెరుగు యీ గురువరాయుని కాయములో జూడుమి కాయమనె యీ మాయ నెరిగెద బాయకను గురురాయుని నెరిగితే మాయ యిరువైయైదు మర్మములాయెనని నిజమంత దెలుపును॥ కా॥

వేదశాస్త్రములచే వెదకి సద్గురులానీ మేధినిలోజూడుమి భంగము చేసె బాధాగురు నెరుగాకుమీ మహానీయుల పాదతీర్థము గ్రోలుమీ పెద్దలువాచా హద్దుమీ రుండాకుమీ అధ్యయనమ్ముఖ ముద్రరాకడ తెలియుమీ చోద్యమై నటువంటి చిత్కళ నెరిగి భేరీమృదంగ నాదము వినుచు నిర్మలమైనజ్యోతిని గనుచు ఆనందించుచుంటిమి॥ కా॥

శుక్లశోణితముచే రక్తమాంసము లైయ్యే చిక్కు విడదీయుసుమీ గొప్పగ మొరిగె కుక్కాలుండెను జూడుమీ రాజసమను రక్కాసులను త్రుంచుమీ గోపము లేని గేకా వేయుచు నుండుమీ ముక్తిగనే విరక్తిభావము జూడుమి రాకపోకలువేసి మీ గురు వాక్యమని మనసూను కోసివేసి యజ్ఞముచేసి కన్నుల గాసితీర్థము గ్రోలుచుండుమి॥ కా॥

యింటిలోపల పోరుకంటే అంటవు మాయా వెంటనున్నారు జూడుమీ అర్థరుదొంగ బంటులున్నారుజూడు మీవైరాగ్యముకంటె

కలరా రాసు మీమటములు ఆరుగటము కుండెను పగిలేటి గటములో మటము లెవ్వరు తెలియజాలరు నటులనామము దెలియుటకు యీ కుటిలబుద్ధులు మానతరమా॥ కా॥

స్వర్గనరకము లెరిగివర్గములను ద్రుంచే అర్థమున్నది జూడుమీ డంభముగోరె దుర్జనులతో పోరు మీడంభముకేది దరికిరాదని నమ్మమీ అనుభవమిడిచితే నరకమున్నది జూడుమీ అర్థమునెరిగి స్వర్గమునకు జేరుమీ ధరనుహరి నారాయణా గురునెరిగి వేదము తిరిగి దీనితరచినా కనకాంబరము ఆసాదులకు దాసోహమనెను॥ కా॥

### ౭౧. తత్వము-రాగము-కాంభోజి-అటతాళము

దేహము గట దేహమునేనిదక యామోహసాగరమున మునిగి చెడితిక॥ దే॥

మోహము దేహముతోనే మొలక లెత్తివచ్చెనాని లోభపాశు చేత దానిలోతు తెలియకా సోహంబానే కేకవేయలేకనూ మూడాశలతో గాసినొందుచూను యముని చేతికి జిక్కితినిక॥ దే॥

మూలము లేపట్టి దేహముద్దులన్ని విడువలేకా కాలామేలా గడపి కన్నాగురుని నెరుగకాఫాలభాగమునీలజోతులందు నిలచియుండేబాల నెరుగా లేకా యింతా గాలము అధముడనైతి॥ దే॥

కామక్రోధము లెట్టివో ఖర్మమంతా తెలియలేకా నీమనిష్టలన్ని వదలి నిలిచి యుండకా ప్రేమమీరగాను ఆత్మరాముని రమించుచుండెదాము నీదరిజేరె ఆర్యదర్పణంబు నెరుగనైతి॥ దే॥

మెరుపు తెలుపు నలుపు మధ్యమందు గురుని నెరుగలేక గురుని సేవజేయుట నేమరచియుండి మరువు తెలువు లేని మంత్రమెరిగి జపము చేయుచుండె గురునిచే గుర్తెరిగి పరమపదవికినే జేరనైతి॥ దే॥

దేహవాసన విడిచే గురుని గాసుకీ కొరగాకుండానే మోహముచే తాను శుద్ధవాసననెరుగాక దేహతత్వా ఆత్మబోధదెల్పె గురువు నారాయణుండెనని పుట్టి మెరుగకుండిన కనకాంబరమునే॥ దే॥

### ౭౨: తత్వము-రాగము- పున్నాగవరాళి-అటతాళము

సేవించుము హరి రామతారకము జీవా చెడిపోకిక॥ సే॥

ఆధారంబున నాల్గుదళములలో అమరిన ఆదిగణాధునికిపుటదఆరు నూరు ప్రణువహంసముతో హింసవదలి హంసోహం బనుచు॥ సే॥

స్వాదిష్టంబున ఆరుదళములలో అమరిన బ్రహ్మకు అర్పితమను కొన ఆరువేలు ప్రణుహంస జపముతో హింసవదలి హంసో హం బనుచును॥ సే॥

మణిపూరకము దళము లమరి పది దళముల లోపల విష్ణు మూర్తికొక ఆరువేలు ప్రణుహంస జపములో హింసవదలి హంసో హం బనుచు॥ సే॥

హృదయ కమలమున దళములమరి పది రెండు దళములలో అమరిన రుద్రున కారువేలు ప్రణుహంస జపముతో హింస వదలి హంసో హం బనుచును॥ సే॥

కంఠస్థానమున దళములమరి పదియారుదళములలోనమరిన జీవున కర్పితమని బదిసూర్ల హంసతో హింసవదలి హంసోహంబనుచు॥ సే॥

ఆజ్ఞయంబున రెండుదళములలో అమరినిలిచినా పరమాత్మున కును అర్పితమని పదిసూర్లు హంసతో హింసవదలి హం సోహం బనుచును॥ సే॥

సహస్రారమున వెయ్యిదళములలో కోటిసూర్యప్రకాశ గద్దెపై అమరిన గురునకు అర్పితమని పాదిసూర్లు హంసతో సోహంబనుచు॥ సే॥

అరమర లేకను పురములో దినముకు యిరువదివేలారు నూర్లజప తారక రేచక పూరకమందున తరుచుగా హం సోహంబనుచు॥ సే॥

హరిహరాదులకు అలవిగానిదట గురునారాయణ కరుణచేతయీ ధరణిలో కనకాంబధర మతినెరిగి నేమరక హం సోహంబనుచును॥ సే॥

## ౨౩. తత్వము—రాగము—కాంభోజి—అటతాళము

యెన్ని శాస్త్రములైన యెత్తిచదువగవచ్చు యీశాస్త్ర మెరుగవే మనసా తిన్నగా పరమపదమున్ను సంగతిదెల్పె కన్నగురు నెరుగవే మనసా॥ యె॥

మదములణచే విధము హృదయమందున లేక చదువ నేలను మాయమనసా ముదిమి యవ్వనము లేని ముదిత సంతోషంబు మనము నెరుగుండవే మనసా॥ యె॥

లోకవాసనలచే గాశియాత్రలుతిరిగి మోసమైతివే మనసా ప్రాకటంబుగ సాంఖ్య తారక మనస్కంబులు సాధించుచుండవేమనసా॥ యె॥

దొంగ లార్గురితో గూడి అంగ డంగడి తిరిగి భంగపడుచుంటివే మనసా గంగ యెమునలదాటి ఘనమైన మేడలో లింగ నెరిగుండవే మనసా॥ యె॥

యిరువదైయిదుతో గూడినా స్థూలదేహమాపేరుతో చెడితివేమ
నసా ఆరుచక్రంబులపై ఆత్మరూపుండిన గురుని జేరుండవే మనసా॥ మె॥

సంసారసాగరము దాటలేకను జననమరణ మొందితివే మనసా
హంసోహంబని యేటిలాడ చేతను మేరుకొండలెగ దాటవే మనసా॥ మె॥

ఒడలు నీళ్లనలడిపి మితము జపములుచేసి మతము లెంచెదవేమి
మనసా షడచక్రముల మీద నడిచె తారక మంత్రములు జపియించు
చుండు మనసా॥ మె॥

అరమరలులేక యీధరణిలో బుధులచే అది శాస్త్రము గనవె
మనసా యెరుక మరుపులు లేని వేదాంత శాస్త్రమిది యెంచ శక్యము
గాదు మనసా॥ మె॥

సారమైనా గురువు నారాయణునకిచ్చె గురుపట్ట మెరుగవే మనసా
ధరను కనకాంబరము మరచు యెరుకను యెత్తిగురునకియ్యవే మాయ
మనసా॥ మె॥

## ౭౮. తత్వము–రాగము–గిరెక్–అటతాళము

శ్రీహరినారాయణ అమృతసారము అనుభవించుచున్న బహు
రోగములకు మందున్నా మహాభూతంబులకుపిడుగన్నా ఆహా యిది రాజ
యోగమన్నా యీధరలో యిచ్చాపత్యము జేసితె వ్యాధికుదరదన్నా
చప్పడిపత్యము చేయన్నా॥ శ్రీ॥

సాంఖ్యతారక మనస్క భావములు తరచె యోగులన్నా భక్తుల
పంచచేరుమన్నా సర్వమూ తానయి యుండన్నా యముడు దరిజేరకుం
డునన్నా ముఖ్యమైన గురుమూర్తినికంటే ముదిత గొరుకునన్నా
యెక్కువ ఆశలేదన్నా॥ శ్రీ॥

వాదభేదములే సద్గురుపాదము కనుమన్నా ప్రశస్తపు బోధ
తెలియుమన్నా యెనిమిది గాధులు విడువన్నా సమీప్యము పదవి దొరు
కునన్నా యీ మేధినిలో హరిమద్వర్గములను అంటకుండుమన్నా అంటితే
హతమాదురన్నా॥ శ్రీ॥

అదిపిండ బ్రహ్మాండపురంబున నిండియున్నదన్నా స్థిరముగ గురు
నిల్పి గూడుమన్నా నీలలోదయు మధ్యంబన్నా నిష్కల బ్రహ్మముతా
నన్నా దండిగసద్గురు పాదము నమ్మితి దరిజేరుదురన్నా నిండు వైకుంఠ
మునకన్నా॥ శ్రీ॥

జోడుపక్షులతోగూడి యేకమున నాడుచుండుమన్నా మనంబుల
మూడు విడువరన్నా ఆరునెగలేసి నడుకుమన్నా యేడు మేడలపయినుం

డన్నా హరిపందు వెన్నెలా ప్రభలెడి తేజం బయలు జూడుమన్నా చూచినిర్భయమైయుండన్నా॥ శ్రీ॥

పంచాక్షరిగని పంచి చదువు చదివితే సంచితము తొలగునన్నా ఆరుచక్రములమీద నున్నా హంస మదినెరిగి మరువకున్నా మహాత్ముల పాదతీర్థమన్నా అంచితముగ గురువరప్రసాదము లెంచి భజించన్నా మనస్సున చింతలు విడువన్నా॥ శ్రీ॥

నారాయణ నారాయణహరి గురురాయుని కన్నా దాసులకూ వరములొసగు నన్నా పాపములు పరిహరించునన్నా జన్మరహితంబని కనుమన్నా యీధరలోన కనకాంబ్రము మతిపెద్దలు దిద్దవలయునన్నా యోగులకు దాసోహంబన్నా॥ శ్రీ॥

౭౫. తత్వము-రాగము-నాదనామక్రియ-అటతాళము

దాసగురువుల వెతకిచూడండీ గురునెరుగకుంటే శాస్వతా సుఖ మందదమండీ వాసిగా ధరలోను నేహరి దాసునని యిలవాసి కెక్కకు మానమై చెడిపోయ్యే మాటలు వాసికెక్కదు ధరణిలోపల లేశమాత్రం శాశవిడువండీ శ్రీరామ భజనా నాసికా ద్వారమున నడవండి భాసుర ప్రకాశమైన జ్యోతిరాముల జూచి ఆశను కోసివేసే వృషము కనుగొని వాసనలు మూడింటి తిరుగని॥ దా॥

ఆరుమూటిని దాటియావల మేరు శిఖరమునందు సూక్ష్మపు దారిగని గురుసేవ నిర్గుణ భావమందున నిజము దెలియక వారువీరని వూరడించేవ్వా గురునిలక హరిమద్వర్గములతో సంచరించేవ్వా హరిహరా బ్రహ్మాది యోగులు తరచినామృత పరమపదమిది మరుపు తెరపులు లేని మర్మము దొరకుబోదిల గురుకటాక్షము॥ దా॥

తల్లిగర్భమునందు తొమ్మిదినెలలు మోసురుకుంట చదివికల్లసంసా రముగని యీతొల్లి చదివిన చదువు మరచి తల్లిదండ్రులనెల్ల గొట్టేవ్వా యిలలోను ఆలిని కొల్ల మోనిమిది కొలచుకుందువ్వా యిల్లుకాలుకవచ్చె నని యెుక తెలివనే కొలనందు నీళ్ళను చల్లి ఆవల కెళ్ళె వృషము మెల్లగా సాధించుచుండుమి॥ దా॥

మాటినెరుగక మూల నున్న చోటుగానక చాటి తిరుగుచు వాట మైనటువంటి జ్యోతిని వదలుకనినే జూచెనని యిలబూటకంబులు మూట గట్టేవు గటమందు ఆరు మటము లుండే మర్మమెరుగావు బట్టబయలై సట్టి అద్వయ గుట్టుదెలిపే గురుని వెతకితె పుట్టుగిట్టుగు లేనిపదవి గట్టిగా కనిపెట్టి చెప్పుము॥ దా॥

తనువు ధనము సంపదంతయు వినయముగ నిజ గురుని కొసగక అనుదినము సంసారమనెడి ఘనపయోనది దాటలేకను ఆవనమందున కాలిపొయ్యెవు జ్ఞానంబుకని అజ్ఞాన మిడచి అణగియుండావు కన్నుగిం దున సన్నబిలలోనున్న సూత్రపు కన్నెరిగి పున్నమ వెన్నెలపై నిలచి తన్నుతాను యున్నమనసా॥ దా॥

యేడుకొండలుదాటి ఆవల జోడుపక్షులు నెరిగినీలో కూడకట్టను మెదుకనేటి తామిచేతను మూడుయేరుల కూడియుండిన చోటుదెలి యండీ ఆయేరులవతల మేడలో నొక ముదిత నెరుగండీ వేడుకతో పారి నామమెరుగని మూఢులతో నీవుకూడి చెడరకావతల దృఢముగ నిజ మైన గురు నరగడిలో సాధించుకసుమీ॥ దా॥

పెద్దవై నీవుండు వూరులో హద్దుదప్పిన మోసగాండ్లను కొద్ది చంద్రా యుధముచే ఆ మొద్దులను పడవేసినరికితే మదము లెనిమిది గదుము కొచ్చ్యాను హంసోహమనె గదచేత యెదిరి నరుకుచుండూము పెదవిలను బంధించిమారుత ప్రణుకమును నారాయణా గురుబోధచే కనకాంబరము సద్ గోష్టి మరువక జేయుచుండుము॥ దా॥

౨౬. తత్వము—రాగము—శుద్ధకాంభోజి—అటతాళము

బ్రహ్మజ్ఞానము నీలో గనరా యీ జిహ్వతో చాడీలు మాను కొనుమురా॥ బ్ర॥

కాయముచే నీమనిష్టలున్నవిరా యీ భామకు సరిలేని ప్రేమా లెందుకురా॥ బ్ర॥

సూది మోపను సందూ లేదు చూడుమురా మేధినిలో బ్రహ్మం నిండీయున్నదిరా॥ బ్ర॥

షడ్చక్రములపైని నడచి యావలరా యీడపింగళిమధ్య వివర మెరుగరా॥ బ్ర॥

గంగాయమునలో కోటిలింగా లున్నవిరా సంగామెరిగి లింగా పూజా జేయుమిరా॥ బ్ర॥

కోటిసూర్యుల కాంతికన్నా వెల్గునురా సాటిలేని గంటా నాధ మున్నదిరా॥ బ్ర॥

జిహ్వతో వేడితే బ్రహ్మయున్నదిరా బ్రహ్మనెరిగినవాడే బ్రాహ్మ ణుం డనరా॥ బ్ర॥

గురుని పాదముబట్టి గుర్తునిల్పుమిరా పరమ పదముచేరె మరుగు దెల్పునురా॥ బ్ర॥

మరువకెప్పుడు గురు నారాయణా నరకేమునకు వెరచె కనకాంబరమురా॥ ౹౹బ॥

౨౨. తత్వము-రాగము-పున్నాగవరాళి-అటతాళము

(శ్రీ)గురునకు దేవకుసుమపుష్పాలపూజా శాయలేకాజపతిమానస మాయరంగు బొమ్మలపూజా శాయనేల॥ (శ్రీ)॥

జశవిధంబులు దేవనాదమని ఆనందించలేకా పశుమృగ మానస కూతలినీ ఆలకించానేలా॥ (శ్రీ)॥

గోత్రాకరు ములేని సూత్రాధారునిగని మ్రొక్కాలేకా మూత్ర ద్వారము మలమూత్రములో వచ్చి మురియుటేలా॥ (శ్రీ)॥

మనసూ కంటాపైనా ఆత్మరాముని భజించలేకా యోనిసంభవు డయినా రాముని గొలిచి బూజించనేలా॥ (శ్రీ)॥

సప్తకోటి మహామంత్రములకు తల్లి నెరుగలేకా గొప్పమంత్రము లని లోకతంత్రములకు దిరుగనేలా॥ (శ్రీ)॥

ప్రణవము బంగరు జిహ్వా వెలిరాగమున తళతళలేకా గుణము విడువకలేక గురువులమని పొట్టగడపనేలా॥ (శ్రీ)॥

గంగాయమున నల్లకలువ బూవులు తరచి చూడలేకా దొంగ లార్గురితో యుంటే అంగమున్నది నీవుపొంగనేలా॥ (శ్రీ)॥

భ్రాంతిరహితముచే విశ్రాంతిమార్గము నీవు తెలియలేకా భ్రాంతి విడువక యున్న చింతలలో నీకీపంతమేలా॥ (శ్రీ)॥

నామనీమము నిష్ఠలేనిరాముని నీవు నెరుగకాలేకా స్వాముల మని దేహ ఆశచేత గుర్తువెయ్యనేలా॥ (శ్రీ)॥

నారాయణగురుబోధ అర్థము అనుభవించాలేక ధరణిలోన కన కాంబరము యెరుకనెరిగి మరువకున్ననేలా॥ (శ్రీ)॥

౨౩. తత్వము-రాగము-శుద్ధకాంభోజి-అటతాళము

ఉపదేశమేలనోయన్నా మనచపలత్వ ముడిగితే చాలుచాలన్నా॥ ఉ॥

ముప్పువచ్చునని యెరుగకరన్నా తప్పునడతలునడచే కుక్కలకన్నా॥ ఉ॥

అష్టవిధములణచి పెట్టాక వాటియిష్టముతో తిరిగే దుష్టులకన్నా॥ ఉ॥

జనసి జనకుల సేవ జేయ కుండగానూ ఘనుల మనుచు డెల్సె గుణహీనులకుమా॥ ఉ॥

పాదు తెలియకానను పావు పెట్టుచునూ బోధజెప్పిన వినని వేధ నాలకూనా॥ ఉ॥

దొంగమాటలుజెప్పి దొరను నేనాని పొంగితిరిగిన పొగరుబో
తులకన్నా॥ ఉ॥

నామ నీమములుంచి నవ్వు చెప్పుచూ పరభామలతో గూడే
బడవాలకునూ॥ ఉ॥

దాసనారాయణదాసునికన్నా మోసముపలచేటి మొద్దులకన్నా॥ ఉ॥

౭౯. తత్వము-రాగము-హిందూస్తాని-కాఫీ-అటతాళం

అఖిలా ప్రపంచమంతయు నీవేనీవేనీ వేనీవే॥

అండము నీవే పిండమునీవే అండ పిండాండ బ్రహ్మాండము నీవే
నీవేనీ వే-అఖిలా॥

అకారము నీవే ఉకారము నీవే ఉపకారము మపకారము నీవే
నీవేనీ వే-అఖిలా॥

సిలలన్ని నీవే సీతలమన్ననీవే యిలను సాగార నిరాగార నీవే
నీవేనీ వే-అఖిలా॥

స్త్రీవన్న నీవే పురుషుడన్న నీవే భావించి చూడ భువనములన్ని
నీవేనీ వే-అఖిలా॥

మరువన్న నీవే మారుతమన్న నీవే యెరుపు తెలుపు మధ్య
వెలిగేది నీవే॥ నీవేనీ వే-అఖిలా॥

పరమన్న నీవే పావనుడన్న నీవే సురులు కిన్నరులు కింపురు
షులు నీవే॥ నీవేనీ వే-అఖిలా॥

క్షరఅన్న నీవే అక్షరమన్న నీవే ధరనారాయణ దాస గురు
నీవేనీ వే-అఖిలా॥

౮౦. తత్వము-రాగము-ధన్యాసి-ఆదితాళము

జీవా హరిని భజించవా మాయ జీవా॥

జీవా పరమాత్మనీవేగావా షట్చక్రములందును తేవా ఆది దేవా
దులకు నీవు సేవా జేయూచు నుంటివిగాన నీ కేమి యిప్పుడు కొదువా
సామీప్యపదవికి త్రోవా॥ మాయజీవా॥

వద్దే తప్పుడు నడతలు నడవవద్దే పెద్దలమాట నిబద్దే చెప్పితే
కోపపడవద్దే చెవులతో వినుము సుబుద్దే దుర్మార్గులతో గూడొద్దే
యముడు చంపునివద్దే॥ మాయజీవా॥

ఆరూ కామక్రోధము లున్నారూ యెవ్వరు కానరారు దుర్బు
ద్ధులూ కలచేరు హరిమార్గములో నున్నారు గురు భక్తులయినావారు
చంద్రాయుధములో నరికేరు॥ మాయజీవా॥

అన్నా నీకన్నా యెవరు లేరన్నా పరమాత్మ స్వరూపము రన్నా పరస్త్రీలను గోరకురన్నా నరకము వున్నది సుమ్మన్నా నాణ్యము గను గొని నీవన్నా నారాయణుడై యుండన్నా॥ మాయజీవా॥

లేరునీతోటి యెవరు రారు దారాపుత్రాదులురారు దానా ధర్మము నీకు చేరు తెలియక పొంగి తిరిగేరు గురురాయుని చేతను తీరు గనుగొంటె ముక్తికిచేరూ॥ మాయజీవా॥

అంబూ మలమూత్రములా దేహంబు నరములు యెముకలు మాంసంబు రుధిరంబు పయిత్యశుక్లంబు నిండుండిన మాయ ఘటంబు జీవుడుండెవరకు క్షేమంబు గన్వాకు కొరగాదు నిజమ్మా॥ మాయజీవా॥

కనెను ధవళగిరి పురమునాను నారాయణ దాసుండేను నయన ద్వయముల నడుమాను నీలంపు జ్యోతులుండేను గనుగొన్న వారికెల్లను కన్నుల పండుగయ్యేను॥ మాయజీవా॥

౮౧. తత్వము—రాగము—శుద్ధసావేరి—ఆటతాళము

జీవులెనుబది నాల్గులక్షలు చావుపుట్టుక లిక్కడా యెవరు జేసిన వారికర్మము లనుభవించే దక్కడా॥ జీవు॥

తల్లిదండ్రులు అన్నదమ్ములు సతియు సుతులను యిక్కడా వెళ్ళి పోయేటప్పు డెవ్వరు రారు మనతో దక్కడా॥ జీవు॥

పంచభూతము వల్లనే ప్రపంచమైనది యిక్కడా అంచితంబుగ నామరూపము లేనిస్థలముం దక్కడా॥ జీవు॥

దొంగ మాటలు జెప్పి దొరనని భంగపుచ్చుదు రిక్కడా సంగ తెరిగిన యముడుబట్టి సాగదీతురు అక్కడా॥ జీవు॥

మనసు బుద్ధాహంకార చిత్తము లణచిపెట్టితే నిక్కడా జననమర ణము లేనిస్థలముకు జేరిపోదురక్కడా॥ జీవు॥

గురువునని మెడనిండ గురుతులు వేసి తిరుగుదు రిక్కడా పరమ భక్తమునీంద్రులెల్ల పసందు జెయ్యరు అక్కడా॥ జీవు॥

నిత్యానిత్య వివేకజ్ఞానము నెరిగితిరగే దిక్కడా సత్యలోకము జేరు టకు సదుపాయ మున్నది అక్కడా॥ జీవు॥

కులము లాచారంబు లెన్నుట కువల యమునం దిక్కడా అల్ల వైకుంఠమందున లేదు భేదము లక్కడా॥ జీవు॥

కామక్రోధా లోభమోహము గాల్చివేయుడి యిక్కడా ప్రేమ తో ఐరావతంబు పైనియెక్కుదు రక్కడా॥ జీవు॥

రంపబొంకేలు ఆడిసంపత్తులు రాలిపోదురు యిక్కడా కాకికత్తుల చేతభటులు గోసివేతురు అక్కడా॥ జీవు॥

యీడపింగళ మధ్యమందు వివరమెరుగుదు రిక్కడా మూడుయే రులు దాటెవారికి ముక్తికలదట అక్కడా॥ జీవు॥

ధనమదాంధము చేతగర్వము నొందితిరుగుదు రిక్కడా అనల మందున వేసి దగ్ధము చేసిపోదురు అక్కడా॥ జీవు॥

లెక్కలేనటువంటి వేల్పుల మ్రొక్కితిమి మనమిక్కడా ఒక్క డుండెను జగముకంతకు నిక్కమిది సుమ్మక్కడా॥ జీవు॥

మానవులై తేను తారక మంత్రిమెరుగ రిక్కడా జ్ఞానయిం ద్రియమైన జిహ్వాలో పలికితే ఫలమక్కడా॥ జీవు॥

ఆశపాశములెల్ల మొకటికి గోసివేసితె యిక్కడా వాసిగానారా యణ హరి దాసుజేరుట అక్కడా॥ జీవు॥

౮౨. తత్వము-రాగం-శంకరాభరణం-ఆదితాళం

ఏమి బ్రతుకుజీవా మనగతికి జూడుత్రోవా॥ యిది॥ యేమి బ్రతుకుజీవ॥
ఏమిబ్రతుకు సుఖమేమి దేహమిది తాపత్రయముల చేత దగలబడే॥ ఏ॥
కలిమి గలిగి లేకున్నను దుఃఖమే కలిగియుంటె యున్నంత వరకు
దుఃఖమే యిది॥ ఏ॥
వాతపైత్యశ్లేష్మంబును శుక్లము మూత్రపురీషనాడులలో మునిగిన॥ ఏ॥
ఆలు పిల్లలను ఆడుకొంటి మన తలిదండ్రులను దలచనైతిమని॥ ఏ॥
నిష్టలెన్ని గలిగున్ననుగాని కష్టము తప్పదు చచ్చేవరకిది॥ ఏ॥
ఇల్లువాకిలెల్లను నిత్యంబని కల్లలాడి కాలంబు గడిపితిమి॥ ఏ॥
గురువునెరిగి దుర్గుణములువిడచి పరమపదంబును జేరనైతిమి॥ ఏ॥
ధరలోనెప్పుడు దొరననుకొంటిమి పరస్త్రీలనుగోని పరువులెత్తితిమి॥ ఏ॥
దేహములోపల దేవునివిడిచి యిహసుఖంబులలో యిమిడియుంటిమి॥ ఏ॥
అష్టమదంబులు నష్టపరచకను యిష్టభావమున తిరిగి జెడితిమిది॥ ఏ॥
వాసిగాను నారాయణదాసుని దోసిలొగ్గి దాసుండనైతి॥ ఏ॥

౮౩. తత్వ వచనము

ఇదియె వేదాంతంబు యిదియె పరతత్వంబు యిదియె బ్రహ్మ పురంబు కిదియె మార్గంబూ యిదియె జీవైక్యంబు యిదియె పరమరహ స్యంబు యిదియె సమాధియు నిష్ట యిదియె నిశ్చయంబూ॥ ఇదియె॥

పంచభూతములైన దేహంబు లోపలను పంచాక్షరము లయిదు

నెరిగి స్థానంబుపంచి యిరువైయైదు భావంబులోపలను వరియించు వారి
రిని గలుగు ఫలితంబూ॥ ఇదియె॥

గంగ యమునలు నడుమను బంగారు మేడలో అంగనామణిగన్న
వారికైశ్వర్యంబూ దొంగ లార్గురితో కూడి భంగపడుచు బ్రహ్మ
సంగ తెరుగని వారికెల్ల నరకంబూ॥ ఇదియె॥

మనసు యేకము జేసి మలినంబు అంతయును డీసి అగ్నిలో వేసి
జేసి దగ్ధంబూ దినమునకు యిరువదొకవేల జపమాధ్యానరుజేయు వారికి
లేదు మల్లిజన్మంబూ॥ ఇదియె॥

కొండగిరిలెల్లనూ కోరితిరుగనేలా మొండవానలచే పడనేల
కష్టంబూ అండపిండాండ బ్రహ్మాండంబులోపలను పండు వెన్నెల బయట
గలదు బ్రహ్మంబూ॥ ఇదియె॥

యిాడపింగళినడుమ యిమిడినడిచేటి హంస జాడ తెలియును
పుట్టిగిట్టే స్థలంబూ పొందుపొందివి నమ్ముకొనిన పాదయ్యేరు జోడుగుడ్లను
నడుమజూడు బీజంబూ॥ ఇదియె॥

ధరణిలో ధవళగిరి పురమందు నిలుచుండీ వర నారాయణదాసు
జెప్పవాక్యంబూ పరమామృతము పంచదార మధురముకన్న రమ
ణీయముగ నుండు రాజమార్గంబూ॥ ఇదియె॥

౮౭. తత్త్వము – రాగము – కాఫి – అటతాళము

నమ్మకూ యిామాయా గటము యిమ్ముగ గొన్నాళ్లు యుండి
అమ్మ అన్న తమ్మ లెడబాసి పోయేగటయే మాయజీవా॥ న॥

కాయమూ అపాయమనకా నీయవస్థలన్నివిడకా వెయ్యికోట్లు
ధనమయ్యా విడనాడి పొయ్యేగటమే మాయజీవా॥ న॥

కాలునిమాయలుగనకా ఆలి పిల్లలమిాదాశలిడక కాల యెము
నిచే కష్టపడుచుంటె సహాయమానా మాయగటమా॥ న॥

నిత్యము బ్రహ్మనుగనవే వుత్తదీ యిాదేహ మనవే తాతపయిత్యా
బహురోతా యిా గటము నిత్యమనకే అసత్యామువినకే॥ న॥

బంగమూ క్షణబంగామనకా పొంగుచు తిరిగేవు వినక దొంగ
లొచ్చి యున్నరు తోడుకెళ్ళె సంగ తెరుగు బంగాపడకా న॥

వర్గమూ లారిటనూ ద్రుంచె అర్థమే నీవుండేపురము సారములేని
సంసార యేరుదాటే మూతాజీవా॥ న॥

నిత్యమూ పరమాత్మనెరిగే సత్యామనె సత్యామిడకే చిత్తశుద్ధి
గలిగుంటె కనకాంబ్ర జ్యోతివైన పరమాత్మవే జీవా॥ న॥

౮౫. తత్వము-రాగము-నాదనామక్రియ-ఆదితాళం

యేమిచేయుదుము యెంతనిచెప్పుదు మూలం బెరుగవె మనసా
కాముని మాయలో జిక్కకుండ శ్రీరాముని దలచనగు మనసా॥ యే॥

ముక్తికోరకు మూఢాశలు గోసేటి యుక్తితెలియవలె మనసా
చిక్కపోకు గాలంబు జూచినా నాపంచదమున మనసా॥

మంచిబుద్ధహంకార గుణంబులు మట్టివేయవలె మనసా ముందర
వచ్చే చేటుమెరుంగక చిందులు ద్రొక్కేవు మనసా॥ యే॥

అయిదు తత్వములు గూడుక మాయశరీరం బాయను మనసా
అయిదు అయిదులకు ఆపనున్న పరమాత్మ నెరుగవలె మనసా॥ యే॥

సాధుసజ్జనుల గూడుక సద్గురుబోధ యెరుగవలె మనసా మేధిని
లోపల మాధవనామము మరువకనే మాయలమనసా॥ యే॥

తిరుగనేలమరి దివ్యతిరుపతులు తనలోయుండగ మనసా తనతల్లి
తండ్రుల తొలిదైవంబని నమ్మితె నయమున్నది మనసా॥ యే॥

నీవుముందు యెందుండ వస్తివో నిజము తావుగను మనసా చావు
పుట్టుకలులేని స్థలంబులకు జేరితె జయమున్నదె మనసా॥ యే॥

ప్రేమతోను వైరాగ్యంబూనితె క్షేమకరము గల్గునే మనసా
రామతారకము మంత్రము జదివితె రాముడు యెమూడు బడవా
మనసా॥ యే॥

పరిపరివిధముల కోరుచునీవు పరుగులెత్తపోకుమి మనసా ధరలో
నారాయణదాసుని నమ్మితె దరిజేర్చునే మాయల మనసా॥ యే॥

౮౬. తత్వము-శ్రీరాగము-ఆదితాళము

యెన్నడూ కనివిని యెరుగగలేదమ్మా జగజ్యోతిరాములకన్న గురు
గురువులచే గంటినమ్మా పున్నమా చంద్రునికాంతి కన్ననూ వెల్గుచు
నున్నవని॥ యె॥

హారిషడ్వర్గము లారువమ్మా దరిజేరకుండా తరిమీా గొట్టుచు
నుండి సుమ్మా యెరుపు తెలుపు మధ్య యెరుకయి యెరుగూచు
నున్నదని॥ యె॥

మూడు మూడును ముడివేయువమ్మా యేడెనిమిదిగొట్టి జూడు
భ్రూమధ్య మందునమ్మా మూడు యేరుల నడుమ ముక్తికాంతామణి
యున్నదని॥ యె॥

దృఢమైనట్టి మంత్రముచేతమ్మా జగజ్జాలము మాయాముడివిడిగో
సితేను సుమ్మా షట్చక్రంబులపైని చెలియా కనిపించుచున్నదని॥ యె॥

జట్టాబయిటను కనిపించునమ్మా పరమాత్ముని స్థానము గుట్టుగను గొన్నవారికి సుమ్మా పట్టి కనకయ్యా గురునిచే గుట్టూగన్నా నారాయణుని॥ ఱు॥

## ౫౨. తత్వము—రాగము—ధన్యాసి—ఆదితాళము

తారకమంత్రముచేతను కొందరు ధన్యులై యుండిరి వోరన్నా మీారకసద్గురు ఆజ్ఞాకులోబడి మేధినిలో గనవలెనన్నా॥ తా॥

సప్తకోటి మంత్రంబులలోపల శ్రేష్టమైనదిరా వోరన్నా గుప్తమైన ప్రణుబాతురం దుత్పతి మంత్రంబులు గావన్నా॥ తా॥

జాగ్రతస్వప్న సుషుప్తిలోనై నను ఝుణకక నడుచును వోరన్నా శీగ్రమునాగురు బ్రహ్మపురము మార్గముజూపెటి మంత్రమురన్నా॥ తా॥

వుండపడ్డ షడ్చక్రములు లందున దేవతలకు బహుప్రీతన్నా దండిగాను యమభటులను నెల్లను ఖండించెడి ఖడ్గమురన్నా॥ ॥తా॥

నారదాది వాల్మీకి వసిష్టుల కెల్ల పరమానందమురన్నా గోరిభజించు వారెల్లప్పుడును చేరిరి వైకుంఠంబన్నా॥ ॥తా॥

యిది వేదాంతము యిది గురుమంత్రము యిదియె రామతారకమన్నా పదిలముగను ఈపద్ధతి గనుగొని చదివితేసమీాప్యంబన్నా॥ తా॥

వాసిగాను ధవళేశపురంబున దాసుడు నారాయణుడన్నా జేసిన పాపము తొలగుటకై యుపదేశము నేబొందితినన్నా॥ ॥తా॥

## ౫౩. తత్వము—రాగము—ధన్యాసి—ఆదితాళము

పరమపదవిగనరా నీలో పరిశోధించుమిరా ధరలోనెనుబదినాల్గులక్షలా జీవులందు మరి పుట్టని గిట్టని॥ పర॥

మెరిగి మెరుగదురా పదవి మరచి మరువదురా మెరుక మరుపులూలేని పదవిరా గురునిచేత గుర్తెరిగిమరచినా॥ పర॥

యెండకు యెండదురా పదవి వానకుతడువదురా అండాండంబున పిండాండంబున బ్రహ్మాండంబున నిండియుండి,రా॥ పర॥

నామములేనిదిరా పదవి రూపము లేనిదిరా నామరూపక్రియలేని పదవిరా యేమియులేని నరాలంభమురా॥ పర॥

భక్తికాదు వినరా పదవి వైరాగ్యము కాదనరా ముక్తికాదు అనుభవముకాదురా యోగముకాదురా సమాదికాదురా॥ పర॥

రాతికిబగులదురా పదవి చేతులకందదురా రాత్రిగాదు శివరాత్రిగాదురా రుతువుగాదు వుపరతయుగాదురా॥ పర॥

జనముకాదు వినరా పడవి తపముగాదు వినరా స్వప్నముగాదుర
నిద్రగాదు సుషుప్తిగాదు జాగరణము గాదురా॥ పర॥

సత్తుగాదు వినరా పడవి చిత్తుగాదు వినరా మంత్రము గాదుర
తంత్రముగాదుర ఆత్మగాదుర పరమాత్మగాదురా॥ పర॥

కర్తగాదు వినరా పడవి కర్మగాదు వినరా పెరుగదు తరుగదు
అరుగదు కరుగదు తిరిగి వేసరి తీర్థము గాదురా॥ పర॥

సంపూర్ణంబనరా పడవి ప్రపంచ రహితమురా మెరుకలేదే
పరమపదమురా కారణశరీర ఆత్మలేనిదే॥ పర॥

యిదిగురుమంత్రమురా పడవి యిది సిద్ధాంతమురా యిది వేదాం
తము రాజబాటా యిదియే అచలము భ్రాంతిరహితము॥ పర॥

గురునారాయణా నెరిగి గుణరహితుని కనరా ధర కానకాంబర
దాసదాసులకు దోసిలొగ్గి మొరబెట్టి కథవిని॥ పర॥

౨౯. ఆత్మరామాయణము—రాగం—ఎదుకులకాంభోజి—ఆది

ఆత్మారాముల చరితామువిందాము రారే ప్రీతితోడుత సుమనము
సందానందకరముగు మోక్షంబట అయోధ్యాయను పట్టణమందట పర
బ్రహ్మమను దశరథుడనిం జ్ఞానశక్తి యిచ్ఛాశక్తియు నిట క్రియా
శక్తితో ముగ్గురు సత్తులటా జ్ఞాన శక్తి కౌసల్యాదేవికట ఆత్మయనే
రాముండు బుట్టెనట యవ్యక్తామను బాల్యము చేతను నిరూప జ్ఞానంబు
మరచెనట జీవాత్మయే తానని భ్రమించెనట దేహేంద్రియంప్రపంచము
నందట మిక్కిలిగను అనురాగముంజేసట శ్రవణమను వసిష్ఠచేతనట
తెలివికలిగితె ఆత్మరాముడీయిట వైరాగ్యమను లక్ష్మణుకూడుట మన
నమనే విశ్వామిత్రునితో నట పైనముగట్టి పొవుచుండుట మహాపాత
కము గిరులు గడచిరట జ్ఞాన మనే బాణమును చేత నటి ఆవరణము
తాటకిని జంపెనట॥ ఆ॥

యిచ్ఛాయనె మారీచునిచూచి ఆత్మారాముడతివేగా సాగరమున
బడవేసి వికారములు విభాహులాగిగాగట రక్కసు లెల్లను శిక్షించెనట
దిరాచర మను రాతిని దన్నట సదాచారి యాహల్యను గాంచట
యేకాంత మిథిలాపుర జేరుట శాంతమనే జనకుని తాచూచెనట
యసూయయను శివచాపము ద్రుంచెనట యానందా సీతను పెండ్లియ్యార
మదమనే పరశురాముని బట్టుట గర్వంబతయు గోసివేసెనట మోక్ష
మనే అయోధ్య జెరెనటా తాను జీవుడు కాదని మెంచెనట జీవాత్మ

రహితను జేకొనిరట పట్టాభిషేకంబు దలచిరట క్రియాశక్తియను కైక వలనట చపలత్వమునా విఘ్నమయ్యెనట॥ ఆ॥

బ్రహ్మమను దశరథుని యెడబాసి మోసమను సాకేతపట్నంబు పురముపడిచి యానందామనె జానకి గూడెనట వైరాగ్యమను లక్ష్మణ తోడట బయలుయనే అయోధ్యా విడిచెనటా చిత్తమనే సరయూనది దాటెనట బుద్ధియనే గుహునితో మాట్లాడెనట తపస్సనే చిత్రకూటము నందెనట మనస్సనే కాకిని బడగొట్టెనట వీరత్వము నాగస్సుత బట్టెనట దైత్యము శాస్త్రము పరిగ్రహించెనట కామమను శూర్పణఖను పట్టుట రూపులేక నిరూపిజేసెనట ఆగామియు సంచిత ఖర్మమట ఖరదూషణ త్రిశరక్కసుల గొట్టెనట యిచ్ఛటనే మారీచు డొచ్చెనట మాయలేడి మృగరూపు దాల్చెనట రాజశమను దశకంఠు డొచ్చెనట డంభమనూ సన్యాసియైనాడట యానందమనే సీత నెత్తుకపోయి లంకనుంచెను రావణుడట॥ ఆ॥

యిచ్ఛాయనే మారీచునిద్రుంచి యానందామనే సీతలేక మిగుల దుఃఖించి వైరాగ్యమను లక్ష్మణతోడట వెంటబెట్టుకొని వెల్లుచుండకట విక్షేపమను వనమునంతటా వివేకమను జటాయు గాంచెనట విమల త్వము సద్గతినొందెనట చింతయనూక బంధుని ద్రుంచెనట సంతోషమను శబరిని గాంచెనటా మనోవికాశము పూజ గైకొనెనట నిధిధ్యాన హను మంతుని తోడట విడువకుండ స్నేహంబు జేసిరట భయమనివాలిని బడ గొట్టెనట నిర్భయమను సుగ్రీవ్నని బట్టెనట నిధిధ్యాన హనుమంతుని బిలి చెనట సీతని వెతకిరమ్మని జెప్పెనట మోహామనే జలరాసి దాటెనట లోభమనే లంకిణీని పడద్రుంచెనట దుర్వాసనలను రక్కసుల గొట్టెనట ఆనందమను సీతను గనెనట॥ ఆ॥

సంకల్పమే యశోకవనమూ నిధిధ్యాన హనుమంతు పెరికివేసె అజ్ఞానమును జంబు మాలినట నిర్మూలంబు తాజేసి వేసెనట సంశయ మను నక్షయ కుమారునట శిక్షించెను శీఘ్రుంబెగ బట్టల విపరీతామను యింద్రజిత్తుంట విధలించెను నావద్ద రాకనట బ్రమయనేటి పాశమును ద్రుంచటా రాజసమను రావణుని జూచెనటా దిఃఖరించి మీసంబుదువ్వె నట మానమనే మహాయగ్ని గాపించట దుఃఖమనే లంకనుగాల్చెనట మోహామనే సముద్రము దాటట ఆత్మయనే రాముని కనుగొనెనట ఆనందామనే సీతసంగతట వివరముగంతయు విప్పి జెప్పెనట ఆత్మరాము

డతి వేగమెత్తేవట మోహామనే సముద్రమును నీకట నిర్మలత్వో సేతువు గట్టెనట॥ ఆ॥

సత్వామనే విభీషణుడొచ్చి రామలక్ష్మణులు శరణా శరణాని మరుగూజొచ్చె భేరీమృదంగము గంతనాదమట ఘుమ ఘుమ ఘుమ ఘుమ ఘుమ్మరించునట డెబ్బది రెండువేల బలంబట లంకచుట్టు ముట్టడి పెట్టెనట విపరీతామను యింద్రజిత్తుడట సందేహమును నాగపాశమట విసరి రామలక్ష్మణుల గట్టెనట వద్యోచార ఖగేంద్రుని వలనట నాగపాశ మూడిపోయి చచ్చెయెనట తామసమను కర్ణునిజంపాగట రాజసమను రావణుడు వచ్చెటా వైరాగ్యమను లక్ష్మణమీదట భ్రమయనె శక్తి బట్టి విసరెనట తగిలి మూర్ఛనొందెను లక్ష్మణుడట నిధిధ్యాస హను మంతుండొచ్చెనటా నిష్టమనేసంజీవిదెచ్చెనట వైరాగ్యమను లక్ష్మణ మూర్ఛట తీసివేసె ఆరనిమిషము లోపట విపరీతామను యింద్రజిత్తునట ఖండించెను లక్ష్మణ సౌమిత్రట॥ ఆ॥

సంచితా మూలబలంబంతా సాధనమను మోహానాస్త్రము చేత త్రుంచేనంతా గాంభీర్యమను ధనుస్సుబట్టట రాజసమను రావణునిజూచె నట జ్ఞానమనె బాణము సంధించుట అహంకార యమృత కలిశమునట ఛేదించెను తన బాణముతోనట యింద్రియుంబులనే పది శిరస్సులట గూల్చి రాక్షసుల నెల్లగొట్టెనట ఆనందామనే సీతను గాంచట మోక్ష మనే అయోధ్య జేరట జీవత్వో నివృత్తికోరకట పట్టాభిషేకంబు బొందె నటా రాజాధిపత్యము వహించెనట గావున యిదియే పరమ గోప్య మటా రామాయణమునకు రహస్యార్థమట యిది వేదాంతము యిదె మంత్రంబట యిది జీవన్ముక్తికి మార్గంబట ధాతుణిలో నారాయణ చూసట శాస్త్రపద్ధతిగ చెప్పుచుండెనట॥ ఆ॥

౫౦. మేలుకొలుపు—రాగము—భూపాళి—అటతాళము

జీవానీవిన వేమి సేవాజేయుచుగురు స్తావరమున జేరి మేలుకో॥ జీ॥
భావమందునీవు భజన జేయుచునుండే త్రోవ తెలిసినజీవా మేలుకో॥ జీ॥

గంగా యమున నడుమ సంగములో గురులింగ మున్నది జీవా మేలుకో దొంగలార్గురు నెల్ల బంగాము జేసి శృంగార వనమంతాజూచి మోదముతోను రంగైనరత్నాల రజితమండపమందు అంగనామణుని జూడ మేలుకో॥ జీ॥

,పరమభక్తులవద్ద పరమార్థముండేను పరికించుటకు నీవు మేలుకో తరుణ మింతటికన్న దొరుకపోదుర నీకు మరువకుండగ హరి స్మరణ

జేయుచునుంటే దురితాము లన్నియు దూరాముతొలగి శ్రీహరిపురము నకు నీవధికుడై యుందువు మేలుకో॥ జీ॥

అన్నా నామనవి విను ఆరునిధులపై అంబగూర్చున్నది మేలుకో విన్నవించితి నీకు వున్న చందము జెప్పి చిన్నవాడని నామాట భిన్నాము కాయకు సన్నపుదిడ్డిలోదూరి పున్నమవెన్నెలబైటయున్న కన్యనుజూడ మేలుకో॥ జీ॥

తోడుయెవ్వరులేరు తడవుసేయక నీవు కడువేగమున జీవా మేలుకో నేడునాడని గడవబోకు యముడునిన్ను వాడికత్తులబట్టి వడిగా నరికే దురన్నా యీడ పింగళమధ్య యిరువుచేసుక బ్రహ్మం జూడగనుటకు నీవు మేలుకో॥ జీ॥

విరివిగ ధవళగిరీశ పురమున నారాయణ దాసుడ మేలుకో జీవా మేలుకో నరము లస్తులు నవరంధ్రములైన అస్థిరదేహమునుండి దూర ననుచున్నావ నరక స్వర్గములు నీకొరకమరుచున్నవి త్వరితముగను నీవు మేలుకో॥ జీ॥

౫౧. మేలుకొలుపు—రాగము—భూపాళ—ఆదితాళము

మేలుకొనవే మేలుకొనవే మేదిని లోపలను నీవు కాలయముని బాధ కోర్వగనీవు మేల్కొనవే॥ జీ॥

పాపమైనను పుణ్యమైనను నీకుతప్పదు ధాతవ్రాసెను గోపపడకుమి చెప్పితిని త్వరితముగ మేల్కొనవే॥ జీ॥

చీము నెత్తురుయున్నకొంపలో చిక్కుపడి మెలగూచు నుంటివి సోమసూర్యుల నడుమ చోద్యముగలదు మేల్కొనవే॥ జీ॥

ఇంటిలోపలయున్న దొంగల నంటుకొని తిరుగూచు నుంటివి జంటయేరుల మధ్య ఆపోజ్యోతి కనుగొనవే॥ జీ॥

సోహంభావముచేత నీవతి చోద్యముగా ధ్యానించు చుంటెను మోహరాసులుకూలి ముందుకు మోక్షమబ్బునదే॥ జీ॥

తొమ్మిదీ దర్వాజ లమరిన తోలుబొమ్మని తెలియలేకను నమ్ముకొని యిమ్మహిలో నుంటివి నీకుతగునటవే॥ జీ॥

ఫాలభాగమునున్న బాలతోకూడుకొని సద్గోష్ఠిసల్పవే బాల నారాయణ మాటాలించు మేల్కొనవే॥ జీ॥

౫౨. లాలిపాట, రాగము—నాదనామక్రియ—ఆదితాళము

లాలిగుమ్మా బంగారుబొమ్మా భూలోకమున వెలసినా గణపతికమ్మా॥లా॥
దేవుడమ్మా నేను జేతునమ్మా భువర్లోకమున వెలసినా బ్రహ్మకుసుమ్మా॥లా॥

సేవనమమ్మా నేను జేతునమ్మా సువర్లోకమున వెలసిన విష్ణుని కమ్మా॥లా॥

సోహంబనమ్మా దాసోహంబనమ్మా భువర్లోకమున వెలసిన రుద్రుని కమ్మా॥ లా॥

దినముకునమ్మా పూజింతునమ్మా జనర్లోకమున వెలసిన సద్గురునికమ్మా॥

యెప్పుడమ్మా వేదుచుందునమ్మా తపోలోకమున వెలసిన పరమాత్మ కమ్మా॥ లా॥

నిత్యమమ్మా నారాయణమ్మా సత్యలోకమున వెలసిన సద్గురునికమ్మా॥లా॥

౯౩. మంగళహారతి, రాగము—యదుకులకాంభోజి—అటతాళము

హారతివ్వరేమంగళహారతివ్వరే వైకుంఠవాసునకారతివ్వరే॥మం॥

ఆసనస్థానంబునం దాధార పద్మమున నాల్గుదళములు వ-శ-ష-స॥ లుండు శాకిని శక్తిగణపతి కారువంతలు॥ హార॥

లింగస్థానంబునందు స్వాధిష్ఠానుపద్మమున కారుదళములు బ-భ మ-య-లుండు ఢాకిని శక్తిబ్రహ్మకు ఆరువేలు॥ హార॥

మరియు నాభిస్థానమున మణిపూరకంబంది దళదళంబులు డ-ఫ లాల్ పదిశక్తి ఢాకిని విష్ణువధిపతి కారువేలు॥ హార॥

హృదయ కమలమునందు అనాహత పదియు రెండు దళంబులుం డును క-ఖ-గ-ఘ-లుండు ఢాకిని శక్తిరుద్రున కారువేలు॥ హార॥

కంఠస్థానమునందు విశుద్ధాంభుజమున పదియారు దళములుఅ-ఆ ఇ-ఈ-లుండు ఢాకినిశక్తి జీవాత్మునకు వెయ్యి॥ హార॥

నయనద్వయముల నడుమ ఆజ్ఞేయంబు రెండు దళంబు లుండును హం-క్షం-బులు గలవు హాస్తినిశక్తి పరమాత్మునకు వెయ్యి॥ హార॥

దండిగను సహస్రారపద్మమున వేయి దళములు అమరియుండును ఓంకారబీజము శక్తిఢాకిని గురుడు అధిపతి లొక్కవెయ్యి॥ హార॥

ధర నారాయణ దాసుడెరిగిన నిండుతారక బ్రహ్మమునకు మరువకను దినదినము కెప్పుడు యిరువదొక వెయ్యారువందలు॥ హార॥

౯౪. కందార్థదరువులు, రాగము—శంకరాభరణము—చాపుతాళము

౧. జనులారజగతిలోపలజననంబై నందుకొక్క తలంపుంచవలెగా మనసులో హరినామస్మరణ ననుదినమును జేయువాడే నతడే సజ్జనుడూ ధ్యానము జేయకున్నా దుర్జనుడూ జననీజనకులే తొలి దైవముగా నెపుడు మనసులో దలచితె రాదు కష్టప్రపంచము తనవు నిత్యముగాదు గనుకను ధనము నీ వెంటాను రాదు ఘనముగా గురుకీలు గని దుర్గుణము లన్నియు విడిచిపెట్టిన॥ నతడె సజ్జనుడూ॥

౨. నరకము స్వర్గము రెండును తురగమునకు లగామువలెను నిర్ణయించెర్ నరకము దుర్మార్గునికిని స్వర్గము పుణ్యాత్మునకనుచూ బల్కిరిట్లుగా జన్మముతిరిగి వచ్చూచెట్లాగా ధరలో నెనుబదినాల్గులక్షా జీవులయందు తిరిగి పుట్టితే ఖర్మం బనుభవించుటయెట్లు మరల జన్మము లేదు జేసిన ఖర్మమునకు పాత్రుండుగావలె గురుకటాక్షమువల్ల గురుకీల్ దెలుసుటకు యిది సమయ మిదియె॥ బల్కిరిట్లుగా॥

3. కాయములో పరంజ్యోతిని యేయుపాయంబు చేతనైనగా నొచ్చుక్ రాయిలోమూనులోబ్రహ్మయు యీయముపుయున్నంతిమట్టుకైన కనగలవా ఓకోరి నామాట వినుబడకవా న్యాయముగా గురుపాదమెప్పుడు నమ్మి బాయకుండగ సేవాజేయుచుండెనుమ్మి వెయ్యికాళ్ళమంటపంబున శేష్యుపై కూర్చుండియుండిన తొయ్యలిని కనుగొంటెనీకుభయమేమియు లేకపోను॥ నైనాకనగలవా॥

౪. ఉపదేశము శాపలెనని కృపతోడను శిష్యుడొచ్చి తేమనిబలికెవ్ర దపదప నీమనసుకని ఉపదేశము యిత్తునాని నీవు జెప్పవోయీ మనసరయూక జప్పన వోయీ కపటనాటక సూత్రధారులకెల్లాను వుపదేశ మిచ్చితె అపకీర్తివచ్చును చపలచిత్తము లేనివారికి సమ్మముగబోధించి జెప్పితె అపరిమిత సంతోషముతో వైకుంఠపురమున జేరియుందురు నీవు జెప్పగలవా॥

౫. తారకమంత్రముకన్నను ధారుణిలోవేరేలేను ధన్యులువినుడీ సూర్యునిచంద్రునిద్వారా నేరువు యెరినుండి నడిపించితె తారకమురా దొరుకుటభువిలో బహుదుర్లభముగా పరమహంసలుతలచి పానము జేసేరు పరమాతారక మంత్రంపరమాభక్తులకటె మరువు తెరకున కుండ జాగ్రత నిరతమును స్వప్న సుషుప్తివో అరమరలు లేకుండ యెప్పుడు తరచుగను జీవాత్మచవివి॥ సదెతారకమురా॥

౬. దొరుకదు శివపంచాక్షరి దొరికితె తా దేహమందు తానెరుగవలెర్ నెరిగినతర్వాతనుమరి యిరువదియైదక్షరములు పంచీచదువన్నా పంచితె పరమాత్మ నీవన్నా యెరిగి యెరుగక జేసియున్న పాపములన్ని దరికీ రాకుండాగ ధ్వంసాదులై పోవు మరియు నైదక్షరములను చక్రంబులైదును అమరియుండును వరుసగా బీజాక్షరంబులు విధము విధము వరులక నీవు కనుకొని॥ పంచీ చదువన్నా॥

౭. వేదాంతము వ్యతిరిక్తము మేదిని లోపలను మూఢజనులకు సుమ్మా నాధబ్రహ్మనందము సాధులు బుధులకును పరమసంతోషకరము

వైరాగ్యమెప్పుడు శుభకరమూ నాడి నీడని పట్టి వాదాభేదము లేల గాదు తెలిసిదిబట్టి బకధ్యంచితేచాలా పాదములు రెండుండు పరమాత్మునకు హంసోహంబు లనియెడి పాదతీర్థప్రసాదమును అనుదినము గ్రోలుచున్న వారికి॥ సంతోషకరమూ॥

౮. రాతిలోనుండిన బ్రహ్మము నీతరమూ దెలియుటకును నిజముగ చెప్పుమూ ఆత్మలో బ్రహ్మముగనుగొని ఆతీరున జీవులందూ యున్నాడని జెప్పుమూ నీలో బ్రహ్మం నీవె గనుగొనుమూ చేతకాన గొల్లా మేకా చంకబెట్టి వెతుకు లాడినరీతి వెఱ్ఱివై తిరుగాకు స్వాతి వానలకెల్ల ముత్యముచిప్ప లాలించుచుండినట్లు ప్రీతితో వైకుంఠపురము కతీతముగ ధ్యానించవలెనంట। నీవే కనుగొనుమూ॥

౯. నరశల్యంబుల దేహముస్థిరమూ నూరేండ్లకుతపసు జేసినగాని మరణము తప్పదు గనుకను పరమార్థము తెలుసుకొనుటా కిదె సమయమురా యింతకు మిక్కిలికి లేదుపోరా నరజన్మమునకన్న అధికాజన్మము లేదు గురుని పాదముబట్టి గురుతునిల్పాటాకు తరుణమింతటికన్న దొరుకదు తనువులోపల జ్యోతిగనుటకు మెరుపు తెలుపు నలుపు మధ్యను నీలములోపరికించుటాకు॥ యిదిసమయమురా॥

౧౦. నమ్మకురా యీదేహము యిమ్మహిలోపలను జననిగర్భమునందున్ తొమ్మిదిమాసము లుండిన పిమ్మట భూలోకమునకూ వచ్చేనిదిగోరా కొన్నాళ్లుండీ పోయెటందుకురా కమ్మానిపల్కాలు క్రమమూగబల్కుచు బొమ్మలాటలువలె ఆడిమరణించుచు దిమ్మిడయినను చేయదుర యీజీవి శాస్త్రాపోతె పిమ్మట కుమ్మరింటా కుండవలెను పగిలితె పసలేదు సుమ్మిర॥ వచ్చేనిదిగోరా॥

౧౧. కన్నుల రెంటికి నడుమను సన్నని బిలముందుదూరె నేర్పరిగుంటే పున్నమివెన్నెల గనుపడు అన్నా చూచి తెలిసులా కాదూకుందువురా యెన్నడువిని కనలేదుపోరా యెన్నివిధముల చెప్పితిగాని వినవేమి మున్ను భక్తులు కడుమోద మొందెదరుగాని అన్ని నామనవి వినుమి ఆరంస్థలపైయున్న బ్రహ్మము కన్యయో కడు బాలుడో గాకున్న చందము తెలియదాయెను॥ ఆదుకుందువురా॥

౧౨. చేదుకి భయమును జెందెదరు మేదిని లోపలను మధురమునకు భ్రమింతురు వేషము చెదుగజూచి జూదము పరస్త్రీలపొంది దుఃఖినచ్చేరు జీవిముక్తిగతిగానలేరు వేదశాస్త్రమువింటె వెఱ్ఱివైతివని పాదు

తెలియని ప్రజలెల్లబలికేరు వ్యాధిరోగము వచ్చినప్పుడు బోధపడు తన మదికినప్పుడు ఆదిమధ్యాంతముని దలచక అనలములో హాతమైతినాని దుఃఖిసచ్చేరు॥

౧౩. రుద్రాక్షులు యేలనురా భద్రముగా నుంచెచాలు భక్తి తోపోరా నిద్రాహారము మరచితె వుపద్రవము రాపచ్చునీకూ నీవె కనుగోరా చెప్పుట కొకరు పనిలేదుపోరా కొద్దిగుణంబులు కోశీవెయ్యా లేకా పెద్దమాట లాడుట ప్రభల మొందుట కొరకా వద్దు వద్దుర వట్టి మాటలు పెద్దలెల్లను బుద్ధి చెప్పుదురు కొద్దిదినములలో పొయ్యేగటము కబద్ద మాడితె బద్ధు డవుదువు॥ సీవేకనుగోరా॥

౧౪. దానము చేయని చేతులుం గానము శేయుంగనోరు ఘనముగ భువి నిదానము కన్నులు ఆత్మా ధ్యానము జిహ్వేంద్రియంబూ జేయు చుండునురా యన్నదనోరు చేయానేరదురా మానాభిమానముల్ మాని ప్రపంచాము తానని మదిలోనుదలచి తేను ఘనముగా నామంత్రములన్ని టికంటె ప్రధానతారకమైనమంత్రము జ్ఞానఇంద్రియమైన జిహ్వేంద్రియ ముతో దలచి తేను ఫలము॥ చేయుచుంచునురా॥

౧౫. చిలుకకు మాటలు చెప్పితె పలుకును అతిమధురముగను జెప్పినమాటల్ చిలుకను పిల్లియుబట్టితే పలుకదు దానదవిపల్కాపల్కు తుందన్నా జెప్పినపల్కు పల్కాదోయన్న యిలలోను నటువలె పలికే టందుకు గురుతు కలిగేలాగున గురుముఖమున గనుగొని తల్లి గర్భము నందు చదివిన తొలి చదువే మల్లిచదివితే ఎల్ల ఏనుగునెక్కి అల్లవై కుంఠ పురముకు చేరిపోదురు॥ పల్కాతుందన్నా॥

౧౬. ఏటికి వంకలుయున్నవి నీటికి వంకలులేవు నేర్పుతోజూడు బాటకు వంకలుయున్నవి బాటికి వంకలును లేవు కనుగోకుమారా నే జెప్పినమాటే వరహారా గటము కెన్నొంతాలు గలిగియున్నను అచట దేవతలాకు మరివంకలును లేవు నటుల నరునికి వంకలున్నను నామముకు మరివంకలున్నవ యిటుల అజ్ఞానంబు కొంకలుగలవు జ్ఞానంబునకు లేవు॥ గనుగోకుమారా॥

౧౭. పాలును కాచే విధమును పాలలలో తోడిచుక్క వేశే విధముగ్ కాలముగడపినవాని మూలముగా దెలుసుకొని తరచ వలె నన్నా తరచితె వెన్నపైకొచ్చునన్న పాలలోపలనైదు ఫలములొచ్చిన వెనుకా పాలాలో గలిపితె మరిగలయునట్లుగ బాలబిడ్డను ముద్దుబెట్టైవు

కాలమెచ్చితే ముద్దుయిచ్చున అలాగవైరాగ్యంబు యున్నవాడే
బ్రహ్మము జేదురన్నా॥ తరచవలెనన్నా॥

౧౮. తల్లిది ధర్మము పిల్లకు పిల్లది కర్మంబు తల్లికెన్నడురాదు
పిల్లలు మాటలుగాని యుల్లము లోపలను నిజె యోచించుకోరా
సంశయము లన్నియు దీరిపోగా తల్లికెన్నన్ని వంకలు గలిగియున్నాను పిల్ల
కావంకాల్లు కలుగునేమో కను తల్లిది పిల్లకును రాదుర పిల్లదీ తల్లికిని
బోదుర కొల్లలుగ చేసినను ధర్మం యెవరు వారే అనుభవింతురు॥
యోచించుకోరా॥

౧౯. నరుడెట్టివాడో జెప్పెద కరములు అవయవములు స్థూలదేహ
మువాడే వాడెట్టుండో తెలియుడి ధరయాకాశంబు మొదలూ నిం
డినవాడే నామము రూపములు లేనివాడే నరుడే నారాయణుండనుచు
బల్కిరిగానీ నరుడెట్లు వారియానో నదిగానరా మదిని జూచిని నెరుగక
గురువు లనుకుని గుడుతూలు మెడతేసుకొని కరుకురాళ్ళకు పూజజేసితే
కామగుణములు వాలిపోవున॥ నిండినవాడే॥

౨౦. కూటికిగుడ్డలుకోరకే కోటుల కొలదిగను విద్యనేర్చుట తె
ల్లనె యేటికి మెదుకుగానడిచితే బాటర భగవంతుడుండె వున్నచోటికి
రా ముక్తికి రాజబాటా నమ్మమిరా బూటకమానలు బొంకా కెప్పటి
కైనా చేటువచ్చును ముందు చెడిపొయ్యేవు గాన నట్టనడుమను పుట్ట
యున్నది పుట్టలోపల లుట్టలున్నవి పట్టశక్యముకాదు గురునిగుట్టుదెలు
సుకోలేనుగాని॥ వున్నచోటికిరాక॥

౨౧. కామము క్రోధము లోభము తామస గుణములను విడిచి
పెట్టితెగాని కాముని భక్తుడుగాడట స్వామిని మరచుచున్నవాడే సోమూరు
డట యెముడుబట్టి శిక్షించునట ప్రేమతోడుత రామనామము యెప్పుడు
వేమరకను నీవు నేడు మెల్లపుడు పాముకుసుముమ విడిచి విధమును యె
ట్లు నేర్చునో అట్లు నీవు కామగుణములు గూలుటకు సద్గురునిచే మరు
గెరుగవలెనట॥ సోమూరుడట॥

౨౨. దేముని నెరుగని చేతను భూములు తిరుగంగవలెనె భువిలో
వల గురుస్వాముల చేతను ఆత్మారాముల గనుగొన్నవాడే రాజయోగ
న్నా భువిలో వానిసాటిలేదన్నా ప్రేమతోడుత మాయాభూతాములను
బెట్టి స్వామీ నాకోర్కెలిమ్మని మొరబెట్టిరి జామికొబ్బరి అరటిపండ్లను
పుట్టినవి దిగమ్రింగుచుంటే జాముజాముకు తెమ్మనీ జనులందరిని బాధిం
పుచుండును॥ రాజయోగన్నా॥

౨౩. కులము నెంచుటయేలను మలమూత్రము నిండియున్న మాంసం బవునూ జలవాయు నగ్నిభూతము వలనను యీ పీవులెల్ల వుద్భావించెనురా యెక్కువ తక్కువేమీ లేకనురా కులము యెక్కువయేని పలుకుచుందురు లోన వెలిగే వెలుగువాలే కులముగానరు మదిని నిలకడెంతయు లేని గటములు యిలను జన్మమైవచ్చినందురు కులము బలమును యెంచుటేలను తలచే రాముడు తనలో యుండగ॥ వుద్భవించెను॥

౨౪. త్రాగుట జూదము యాడుట భోగము పరస్త్రీలతో సుఖించుట లెల్లన్ అగడవు నడత రాజయోగికి యీ గుణములెల్ల వుండావురన్నా వుంటెను రాజయోగీ కాడన్నా రాగద్వేషములెల్ల రాలగొట్టితే గాని నాగకన్యనుజూడా నరులా శక్యముగాదు ఆగామి సంచితఖర్మ ప్రారబ్ధంబు లందరి కమరియున్నవి యోగియైనను జోగియైనను బైరాగియైనను విడువనవ్వీ॥ యుండావురన్నా॥

౨౫. గురువని పడిపడి మ్రొక్కేరు ధర తలిదండ్రులకు నెవరు మ్రొక్కేరు భువిలో మొరిగినకుక్కలు మేలుర నరునికి సుంతైన విశ్వాసము లేదుసుమిరా తలిదండ్రి గురు దైవా మనరురా భార్యబిడ్డలులేని భక్తాలమనియేరు వీర్యా మెవ్వరిపాలూ చేతునోజప్పారు గురునీ కర్పితమనుచూ బలికేరు నరులు అంతటివారు గలరా హరిహరాదులే యీకలేకను మూడుకాల్వలో మునిగిపోయ్యేరు॥ సము లేదుసుమిరా॥

౨౬. ధరలో శిష్యుల ధనము హరించెటి గురువులును గలరు అరవుర లేకన్ స్థిరముగ శిష్యులగుణము హరించేటిగురుమూర్తికొరకు టది దుర్లభమురా బుద్ధితో నీవు యోచించుకోరా గురువనగా రూప గుణములు లేనట్టి పరమాత్ముడనుచూను పలికేవేదములెల్ల నిరతముగ దుర్గుణములెల్లన్ విడిచి సత్యమునడిచెవాడట గురువునకు గురువనుచు ముని రుషిగుణము లెల్లను బల్కిరటా॥ అది దుర్లభమురా॥

౨౭. జడలు ధరించుటయేలను అడవులలో ఆకులలము నములుటయేలా పుడమిచరించుట యేలను బకబాగ్నియు వేశి ముందూ పడియుండు నరజనులకు జడిపించుటకును కూడియెడములమధ్య కుదురుగమరియున్న నడినాళమిందూనా నాదునరుగరైరి పుడమి తలిదండ్రులకు శేవజేసి యోగమునల్పి మామాముడిని విడిగోసితే యేరుల మాటి నడుమను ముక్తి కనుపడు॥ పడియుండనేలన్॥

౨౮. గురుయనే రెండక్షరములు మరుగెరిగిన వారుభువిలో మహనీయులారా సరసములాడుట గాదుర పరిపూర్ణము తత్వబోధా పరికించ

వలెరా లేకుంటే నరకకూపములరా స్థిరమతితో నిజస్థితిని గన్నట్లయితే పరప్రపుట్టుప యెంతవారికైనను మదిలో కర్పూరము ముట్టించి దీపము లోన బ్రహ్మము జూచినాసరే దర్పణము చేబట్టి బ్రహ్మము జూచుటకు బహుశుభమనిరీ॥ పరికించవలెరా॥

## ౬౫. శ్రీశారదరామాయణము - వర్ణమెట్టు

అయ్యా ముందుగణపతిని పూజింతునయ్యా - శారదాంబకు శరణంటినయ్యా-బ్రహ్మవిష్ణు శివునికి దండమయ్యా-పరమభక్తులకు దాసోహమయ్యా-వేదశాస్త్రముందున బోధరయ్యా-తెలసియున్నమట్టుకు జెప్పెదమయ్యా-తప్పొప్పులున్నను దిద్దరయ్యా-బాలుడను నేను భక్తితో నయ్యా - సాంఖ్యసూత్రంబు జెప్పితినిరయ్యా - చదివి అర్థంబు గంటె ఫలమయ్యా॥ నారాయణా॥ నారాయణా॥

ఉంది బట్టబయలనే యాకాసముంది-ఆకాశములో గాలిబుట్టింది గాలిలోపలను అగ్నిబుట్టింది-అగ్నిలోపలను-జలముబుట్టింది జలములోపలను పృథివిపుట్టింది-అయిదయిదు యిరువైయైదయిందీ॥ నా॥

చెంది॥ ఆకశము రెండుభాగము లయింది-అందర్థభాగము నాల్గయింది-వకటి గాలిలో గలసిపోయింది - కలిసిగాలిచే మనసుబుట్టింది - వకటి అగ్నిలో అమరిపోయింది-అమరి అగ్నిచే బుద్ధిపుట్టింది - వకటి జలములో చేరిపోయింది-చేరి జలముచే చిత్తమయ్యింది - వకటి భూమిలో భుక్తమయ్యింది-భూమిచేత అహంకారమయ్యింది॥నారాయణా॥ నారా॥

వుండె॥ గాలిరెండు భాగంలైయ్యుండే - అందర్థభాగము నాల్గయుండే - వకటి అగ్నిలో అమరిపోయుండె-అందుదానవాయువు బుట్టుచుండే-వకటి జలములో చేరి పోయుండే-చేరి ప్రాణవాయువు బుట్టుచుండే-వకటి భూమిలో భుక్తమైయుండె - వుండపానవాయువు గల్గుచుండే - వకటి ఆకశంబునంటిపోయుండే - వంటి సమానవాయువు బుట్టుచుండే॥ నారాయణా॥ నారాయణా॥

పోయె॥ అగ్ని రెండుభాగములయిపోయె - అర్థభాగమూ నాలుగయ్యె-వకటి జలములోపల చేరిపోయె - చేరి జలముచేతను జింహ్వాయయ్యె వకటి భూమిలోపల భుక్తమయ్యె - భూమిసంబంధమున ఘ్రాణమయ్యె - వకటి ఆకసములో నంటిపొయ్యె - అంటి ఆకసముచే శ్రోత్రమయ్యె - వకటి గాలిలోపల గలసిపోయె - కలసి గాలివల్లను చర్మమయ్యె నారాయణా॥ నారాయణా॥

విడెనా॥ జలము రెండుభాగములయ్యేను - అర్ధభాగమూ నాలుగయ్యేనూ-వకటి భూమిలో భూక్తమయ్యేను-భూమిలో గలసి గంధము య్యేను వకటి ఆకాశము నంటిపొయ్యేను అంటియుండ శబ్దంబు బుట్టెను వకటి గాలిలో గలసిపొయ్యేను-కలసి గాలిచే స్పర్శమయ్యేనూ - వకటి అగ్నిలో అమరిపొయ్యేను-అమరి అగ్నిచే రూపమయ్యేను॥ నారా॥

మెరా॥ పృధివి రెండుభాగంబులయ్యేను-అర్ధభాగమూ నాలుగయ్యేరా-వకటిఆకాశమునంటిపొయ్యేరా-ఆకాశమువల్ల వాక్కుగలిగేరా వకటి గాలిలో గలసిపోయెరా-కలసిగాలిచే ప్రాణ బుట్టెరా-వకటి అగ్నిలో అమరిపోయెరా-అగ్నిలోగూటి పాదము య్యెరా - వకటి జలములో చేరిపోయెరా - జలములో చేతువస్తబుట్టెరా॥ నారాయణా॥

మేలూ॥ వృక్షాదు లిరువదియులక్షాలు-జలచరము తొమ్మిదియులక్షాలు-క్రిమికీటములు పదకొండులక్షాలు - నరజాతులు నాల్గులక్షాలు-గోవు మృగములు ముప్పదియులక్షాలు-పక్షివర్గములు పదియులక్షాలు-జీవులెనుబదినాల్గు లక్షాలు॥ నారాయణా॥ పారాయణా॥

అంబూ॥ ఏమిజెప్పుదును స్థూలదేహంబు-పాదవ్రతొంబదియారంగుళంబు-విరివిగా నాల్గుజాణలుపలంబు-మణుగు నాలుగు శేర్లుండు మాంసంబు - మెముకలవదియూడు నిజంబు - డెబ్బదియిరెండువేలుండు నరంబు-మూన్నైమూడుకోట్లుండు రోమంబు-కూడుకొనియుండు శోలపైత్యంబు మఱియు నరశోలెడుండు శ్లేష్మంబు - నిండియుండినా మాయగటంబూ॥ నారాయణా॥ పారాయణా॥

కద్దు॥ ఓంకారబీజము వకటికద్దు - శివ పరమాత్మలును రెండు కద్దు - ఈషణత్రయంబులు మూడుకద్దు - అంతఃకరణంబులు నాల్గు కద్దు - పృథివి వాయుభూతము లయిదుకద్దు - కామక్రోధము లోభము లారుకద్దు-సప్తవ్యసనంబులు ఏడుకద్దు - అష్టమదములు యెనిమిదికద్దు నవద్వారములు తొమ్మిదికద్దు-దశనాథంబులును పదియుకద్దు॥ నా॥

భూతం॥ అస్థిచెర్మమాంసము పృధివిభూతం-రక్తమూత్ర శుక్లము వుదకభూతం క్షుత్తినిద్రసంగము అగ్నిభూతం - భయము, లజ్జ, తీవ్రము వాయుభూతం - కామక్రోధలోభా ఆకాశభూతం॥ నారాయ॥

శంబూ॥ శ్రోత్రమునకు అధ్యాత్మశబ్దంబు-చర్మమునకు అధ్యాత్మ స్పర్శంబు - నేత్రమునకు అధ్యాత్మరూపంబు - జిహ్వామునకు అధ్యాత్మ రసంబు- ఘ్రాణమునకు అధ్యాత్మగంధంబు॥ నారాయణా॥

ఆత్మా॥ వాక్కునకువచనంబు అధ్యాత్మ-హస్తమునకు దానంబు

అధ్యాత్మ - పాదములకు గమనంబు అధ్యాత్మ - వాయువుకు విసర్గ మధ్యాత్మ-ఉపస్థకానంద మధ్యాత్మ॥ నారాయణా॥

అణుగు॥ స్పర్శవాయు చర్మమందున అణుగు-రూపమగ్ని కన్నుల యందున అణుగు-రసము ఉదకము నాలుకయందు నణుగు-గంధము పృథివి ముక్కునందున అణుగు-శబ్దమాకాశ చెవియందు నణుగు - వచనమాకాశ నోటియందణుగు - గమనవాయు పాదములయందు నణుగు-దానమగ్ని హస్తమునందు నణుగు-విసర్జమునుదక గుదమందున నణుగు-ఆనందంపృథివి ఉపస్థనం నణుగు॥ నారాయణా॥ పారాయణా॥

త్రియము॥ స్థూలసూక్ష్మ కారణ దేహత్రియము జాగ్రస్వప్న సుషుప్త్యవస్థత్రియము - జీవ అంతః పరమాత్మాత్మత్రియము - నేత్ర కంఠ హృదయస్థానత్రియము-విశ్వప్రాజ్ఞతైజసభిమానత్రియము-రాజసతామస సత్వికగుణత్రియము - రక్తశ్వేత నీలవర్ణత్రియము-బ్రహ్మావిష్ణురుద్రుడు దైవత్రియము॥ నారాయణా॥ పారాయణా॥

అంబూ॥ కోరుటందుకు బుధులు కామంబు - కోరినది కాకపోతే క్రోధంబూ - ద్రవ్య మొకలకుండుటయు లోభంబు ధనముమీద అపేక్ష మోహంబు - ధనముగలిగియుబ్బినదె మదంబు - పరులజూచి వోర్వనిదె మత్సరంబూ॥ నారాయణా॥పారాయణా॥

మదమూ॥ కులము యెక్కువన్నదె కులమదాము సకలనిష్ఠుండనే నిష్టమదము-ధనముయున్నదన్నను ధనమదాము - రూపమెక్కువన్నదె రూపమదము-బలముగలదన్న యవ్వనమదాము - పెక్కుచదివితన్నను విద్యమదము-రాజ్యమున్నదన్నది రాజ్యమదము-తపసిజేసితన్ననుతమో మదమూ॥ నారాయణా॥ పారాయణా॥

స్థానం॥ జ్ఞాతయెప్పుడుండును చక్షుస్థానం మనస్సుయుండునుకంఠ స్థానం-బుద్ధివొప్పుచుండును-ముఖస్థానం చిత్తమెప్పుడుండును నాభిస్థానం అహంకారముండును హృదయస్థానం॥ నారాయణా॥

వర్ణం॥ సమానవాయువు నీలవర్ణం-వ్యానసవాయువు గోక్షీరవర్ణం ఉదానవాయువు సౌదవర్ణం - ప్రాణవాయువు వింద్రానీలవర్ణం - అపాన వాయువు హరితవర్ణం నాగవాయువుండును పీతవర్ణం కూర్మవాయువుండు ను శ్వేతవర్ణం-కుకురవాయువుండును రక్తవర్ణం - దేవదత్తవాయువుండు ను స్ఫటికవర్ణం దేవదత్తవాయువుండును నీలవర్ణం॥ నా॥ పా॥

వ్యసనం॥ దేహాభారముండుట తనువ్యసనం-దొంగతనము జేయుట మనోవ్యసనం-ధనముమీద అపేక్ష ధనవ్యసనం-అప్పునో కాదో యను

ట రాజవ్యసనం-క్షేత్రములకు బోవుట విశ్వవ్యసనం-పుత్రమిత్రులం దు త్సాహ వ్యసనం-పోయివచ్చెడ సేవకావసనం-॥ నా॥ పా॥

వుండూ॥ గుదస్థానమున ఆధారముండు-లింగస్థానము స్వాధిష్ట ముండు-నాభిస్థానమున మణిపూరకాముండు - హృదయస్థానమున అనా హతముండు - కంఠస్థానమున విశుద్ధముండు - భ్రూమధ్యమున ఆజ్ఞేయ ముండు-లలాటమున సహస్రారముండూ॥ నా॥ పా॥

స్థానం॥ గణపతెప్పుడుండును గుదస్థానం - బ్రహ్మయెప్పుడుండును లింగస్థానం-విష్ణువొప్పుచుండును నాభిస్థానం - శివుడు యొప్పుడుండును హృదయస్థానం-జీవుడొప్పుచుండును కంఠస్థానం - ఆత్మయుండును భ్రూ మధ్యస్థానం - గురుడుయుండునూ లలాటస్థానం॥ నా॥ పా॥

వుండే॥ యీడ నాడెడమభాగమందుండె పింగళనాడి కుడితట్టు నుండే-సుషుమ్న నాడి మధ్యమందుండ-సందులోపలను జ్యోతెలుగుచుం డే-గన్నవారందరీకెల్లనిండే-పరమపదము నాపందుగై యుండే॥ నా॥ పా॥

చాలూ॥ ఆకలియుదప్పి ప్రాణధర్మాలు-శోకమోహ మనోధర్మ ములు-జననమరణములు దేహధర్మములు - వివరముగ జెప్పెనోపదూ ర్మాలు-రసము రుధిరమాంసము ధాతువులు - అధ్యాత్మ చలిజ్వరము వుపద్రాలు - ఆదిభౌతికము వ్యాఘ్రు వుపద్రాలు - ఆదిదైవికము పిడుగు వుపద్రాలు-యీమూడును తాపత్రియములూ॥ నా॥ పా॥

మేలూ॥ శ్రోత్రత్వక్కు చక్షువు యింద్రియములు-శబ్దస్పర్శ రూ పంబు విషయములు-దిక్కుగాని సూర్యుడు దైవములు - వాక్కుపాణి పాదము యింద్రియములు - వచనదానగమంబు విషయములు అగ్ని యింద్రుడు పేంద్రదైవములు-జ్ఞానకర్మేంద్రియములు వివరములు॥ నా॥

నాడి॥ కుడినేత్రమున గాంధారినాడి-యెడమనేత్రమం హస్తినీనాడి కుడికర్ణమందున పూషణాడి - యెడమకర్ణమం దశ్వినీనాడి-మేండ్రమం దనలంబసనాడి-గుదస్థానమునుండు కుహునాడి - నాభిస్థానమునుండు శంఖినీనాడి॥ నా॥ పా॥

యుక్తి॥ యెరుపువర్ణముండును క్రియాశక్తి-తెలుపువర్ణముండును జ్ఞానశక్తి నలుపువర్ణముండును యిచ్ఛాశక్తి-నీలమైనపాప అదిశక్తిపాప మధ్య వెలుగే పరాశక్తి॥ నా॥ పా॥

వకటే॥ అండపిండబ్రహ్మాండ మున్నొకటే-నాదుబిందు కళలన్న నూరకటే-సూర్యచంద్రగ్ని మండలములొకటే - గంగయమున సరస్వ తులువకటే-ఓంకార ప్రకరణమన్నవకటే-రాజస తామసాత్వికమన్నొ

ము-బ్రహ్మ విష్ణు రుద్రుడన్న వరచే-మొదవు తెలుపు నలుపన్నను వరచే॥ నా॥ పా॥

ద్వీపం॥ తలలోపలుండును జంబుద్వీపం-హస్తలోపల నుండును ప్లక్షద్వీపం-రక్తనరమునందు శాకద్వీపం - చర్మమందుండును శాల్మలీ ద్వీపం-గోళ్ళయందుండు పుష్కరద్వీపం - మాంసమందు నెప్పుడు సుఖ ద్వీపం-రొంట్రుకలందునను క్రౌంచద్వీపం॥ నా॥ పా॥

సముద్రం॥ మూత్రమందురూ లవణసముద్రం - చెమటయందురూ యిక్షుసముద్రం-యింద్రియా మందుతూ సురసముద్రం- శోణితంబొప్పె సర్పి సముద్రం-శ్లేష్మమందురూ దధియు సముద్రర-జొల్లు అందురు క్షీర సముద్రం-కన్నీరు శుద్ధోదకసముద్రం॥ నా॥ పా॥

వుండూ॥ భూలోకమే గుదమునందుండూ - భువర్లోకమే గుహ్యమందుండు - సువర్లోకమే నాభియందుండు - మహాలోకమే హృదయమందుండు - జనలోకమే కంఠమందుండు-తపోలోకమే భ్రూమధ్యమందుండు - సత్యలోకమే లలాటమందుండూ॥ నా॥ పా॥

నిండే॥ అతల అరికాళ్ళయందొప్పుచుండె - వితలమీగాళ్ళయందమరియుండె-సుతలమడిమలందున నొప్పుచుండె - పిక్కలందు తలాతలంబుండె మహాతల తొడలయందుండె-పాతాళ గుదమందొప్పుచుండె॥ నా॥

అంటి॥ ధవళగిరిపురమునందు నేనుంటి-నారాయణ దాసుసుమ్మంటీ దాసదాసులకు దాసోహమంటి - దర్పణముచేత బట్టవలెనంటీ - నయన ద్వయము మధ్యను జూడమంటీ - చూచితె లోన చోద్యముండంటి - చోద్యమెరిగేవారికి స్వర్గమంటీ॥ నా॥ పా॥

## సాంఖ్య సూత్రం

### మనుష్యామృగాది భేదనిర్ణయము

శ్లో॥ స్థావరో లక్షవింశత్య జలజో నవలక్షకః - క్రిమీణాం రుద్ర సంఖ్యాశ్చ చాతుర్లక్షంతు మానుషం॥ త్రింశల్లక్షం గవానాంచా । పక్షీణాం దశలక్షకమ్॥

వృక్షాదిస్థావరవర్గములు ౨౦ లక్షలు, నీటియందుబుట్టినమత్స్యాది జలవర్గములు ౯ లక్షలు, పురుగులు మొదలగు క్రిమివర్గములు ౧౧ లక్షలు, మనుష్యజాతి భేదములు ౪ లక్షలు, గోవు మొదలగు మృగవర్గములు ౩౦ లక్షలు, పక్షివర్గములు ౧౦ లక్షలు, అంతు మొత్తముయెను బదినాలుగు లక్షల జీవరాసులు గలవు వీనిలో మనుష్య జన్మముమాత్రము దుర్లభంబు.

## మనుష్యప్రమాణము

| | |
|---|---|
| ౯౬ అంగులములు | శేరు గుండెలు |
| ౮ జానల పొడవు | అర్థ శేరు రుధిరంబు |
| ౪ జానల వలం | మణుగు నాల్గు శేర్ల మాంసము |
| 33 కోట్లు రోమంబు | సోల పైత్యము |
| ౭౨ వేల నరములు | అరసోలెడు శ్లేష్మము |
| ౬౬ యెముకలు | యిన్నింటిలోకూడుకొనియుం |
| ౯౨ కీళ్ళు 33 మూళ్ళ పేగు | డిన స్థూల శరీరము |

## ఘట లక్షణము

ఘటమనగా వేదాంత శాస్త్రంబున దేహమునకు వేరుగ మావ్యవాచకంబున కుండకుపేరు. ఈ దేహముకూడా కుండవలె కొంతకాలములో క్షీణించిపోవును కాన శరీరమునకుకూడా ఘటమని పేరు పెట్టబడియున్నది అంతేకాదు, కుండ యేలాగు పగలిపోతే మరల ఆ మన్ను ప్రయోజనపడదో అట్లే ఈ శరీరమునందు లోపలవెలిగే పరమాత్మ పోయినమీాద ప్రయోజనపడదు ఇట్టి ఘటమును నిర్మించిన పరబ్రహ్మము తానే యన్ని దేహములయందును వెలుగుచున్నారు.

ప్రాణులకు సప్తావరణాలు కలవు. అవి యేవనగా, దుఃఖము మొదలావరణము, శరీరపరిగ్రహము రెండవ ఆవరణము, కర్మము మూడవఆవరణము, రాగద్వేషాలు నాల్గవ ఆవరణము, అభిమానము ఐదవ అవరణము, అవివేకము ఆరవ ఆవణము, అజ్ఞానము యేడవ ఆవరణము, అందు దుఃఖము శరీరపరిగ్రహమువల్ల వచ్చినది, శరీరపరిగ్రహము కర్మవల్ల వచ్చినది. కర్మము రాగద్వేషాలవల్ల వచ్చినది. రాగద్వేషాలు అభిమానమువల్లవచ్చినది, అభిమానము అవివేకమువలన వచ్చినది, అవివేకము అజ్ఞానమువల్ల వచ్చినది, అజ్ఞానము అనాదయైనది గనుక ఇందువల్లవచ్చినది యని చెప్పశక్యముగాదు, ఆ యజ్ఞాను ఆత్మజ్ఞానోదయము కలిగినయెడల పోవును, అజ్ఞానము పోయినయెడల అవివేకముపోవును. అవివేకము పోయినట్లయితే అభిమానము పోవును, అభిమానము పోయిన పక్షమున రాగద్వేషాలుపోవును. రాగద్వేషాలు పోయినపక్షమున కర్మము పోవును, కర్మము పోయినయెడల శరీరపరిగ్రహముపోవును, శరీరపరిగ్రహము పోయినయెడల దుఃఖముపోవును, ఆత్మజ్ఞానమెట్లు కలుగుననగా, ఆత్మానాత్మ విచారము చేయుగా కలుగును, అయాత్మానాత్మ విచారము చేయుటయందు సాధనచతుష్టయ సంపత్తికలవాడే అధికారి, సాధన

షట్సంపత్తి సంపత్తియనగా, నిత్యానిత్యవస్తువివేకమనియు, యిహాము త్రార్థ ఫలభోగ విరాగమనియు, సమాది షట్క సంపత్తియనియు, ము ముక్షుత్వమనియు, నాలుగు సంగతులుగనుండుట, నిత్యానిత్యవస్తువివేక మనగా, బ్రహ్మనిత్యము ప్రపంచము అనిత్యము అని తెలిసికొనుట. ఇహా ముత్రార్థఫలభోగ విరాగమనగా, ఇహలోకమందు ప్రత్యక్షమని వనితాది విషయములందున్న స్వర్గలోకమందు రంభాసంభోగాది భోగములయం దున్న వాంతాశన మూత్ర పురీషణాదులను భక్షించవలెనను ఇచ్ఛయె టువలె గలుగదో అటువలెనే ఇచ్ఛటగలుగపోవుట, సమాధిషట్క సంప త్తియనగా, శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధా సమాధానము అనునవి ఆరు కలిగియుండుట, శమమనగా, ఇంద్రియాదులు వేదాంత శ్ర వణ వ్యతిరిక్తమైన విషయాదులనుం గూర్చిపోవునపుడు, వానినిమళ్ళించి వేదాంతశ్రవణాదులయందు నిలుపుట—దమమనగా, మనస్సు వేదాంత శ్రవణ వ్యతిరిక్తమైన విషయాదులతట్టు పోవుచుండగా, దానిని మళ్ళిం చి వేదాంతశ్రవణాదులయందు నిలుపుట, ఉరపతియనగా, సమస్తకర్మ ముల నుపన్యశించుట—తితీక్ష అనగా, మానమువచ్చినను, అవమాన ము వచ్చినను, సుఖమువచ్చినను, దుఃఖమువచ్చినను ప్రారబ్ధమువల్ల ఏ వేళకు ఏదివచ్చునో అనుభవించక తీరదు అని ఓర్చియుండుట—శ్రద్ధ అనగా, గురువేదాంత వాక్యేశ్వరులయందు విశ్వాసముపుంచుట—సమా దానమనగా వేదాంత శ్రవణాదులయందు మనస్సు, పూర్వవాసనలచేత విషయాదులను గూర్చి బోవుచుండగా ఆమనస్సును మళ్ళించి వేదాంత శ్రవణాయలయందు నిలుపుట—ముముక్షుత్వ మనగా, మోక్షేచ్ఛ, పృథి వ్యాధి పంచభూతములలో, ప్రథమము ఆకాశము, ఆకాశమునందు వా యువు, వాయువునందు అగ్ని, అగ్నియం దుదకము, వుదకమునందు పృథివి వుత్పత్తియై స్థూలపంచీకరణ మయ్యెను—అది యెట్లనగా,



మొదటి ఆకాశము రెండుభాగములై, అర్ధభాగంబు యుండ తక్కిన యర్ధభాగము నాల్గుభాగంబులై వాయువు, అగ్ని జలము, పృథివిలో చేరిపోయెను అందు వాయువుతో గూడుటచేత మనస్సు బుట్టెను. అగ్నితో చేరుటచేత బుద్ధిపుట్టెను, జలముతో కలయుటచేత చిత్తము గలిగెను, భూమిలో సంభవించుటచేత అహంకారము గలిగెను.




వాయువు రెండుభాగంబులయి అర్ధభాగంబుయుండ తక్కిన అర్ధభాగము నాలుగుభాగంబులై ఆకాశం, అగ్ని, జలము, భూమిలో గూడుచున్నవి అందు ఆకాశముతో గూడుటచేత సమానవాయువు గలిగెను, అగ్నితో జేరుటచేత ఉదానవాయువు గలిగెను, జలములో గలియుటచేత ప్రాణవాయువుజన్మించెను. భూమిలో మిశ్రమగుటవలన అపానవాయువు పుదయించెను.




అగ్ని రెండుభాగంబులయి అర్ధభాగంబుయుండ, తక్కిన యర్ధభాగంబు నాలుగుభాగంబులయి ఆకాశము, వాయువు, జలము, భూమినిం గూడుచున్నవి. అందు ఆకాశముతో చేరుటచేత చెవులుపుట్టెను, వాయువుతో సంభవించుటచేత చర్మము గలిగెను జలముతో గూడుటవలన నాలుక పుట్టెను, భూమితో గలియుటవలన ముక్కు గలిగెను.



జలము రెండుభాగంబులయి అర్ధభాగంబుయుండ, తక్కిన యర్ధ భాగంబు నాలుగుభాగంబులయి ఆకాశము, వాయువు, అగ్ని, పృథివినిం గూడుచున్నవి. అందు ఆకాశముతో గూడుటవలన శబ్దము పుట్టెను, వాయువుతో గలయుటచేత స్పర్శముగలిగెను. అగ్నితో సంబంధించుట వలన రూపము పుట్టెను, భూమితో జేరుతచేత గంధము గలిగెను.



భూమి రెండుభాగంబులయి, అర్ధభాగంబుయుండ, తక్కిన యర్ధ భాగంబు నాలుగుభాగంబులై ఆకాశము, వాయువు, అగ్ని జలమునందు కూడుచున్నవి అందు ఆకాశముతో చేరుటవలన నోరుకలిగెను. వాయువుతో కలయుటచేత చేతులు జనించెను, అగ్నితోగూడుటవలన కాళ్ళు పుట్టెను. జలముతో మిశ్రమగుటచేత శిశ్నము కలిగెను.

సప్త వ్యసనములు

తను వ్యసనం——దేహాభారము సంభవించి కలువరించుట.

మనోవ్యసనం——మనోవికారము కలిగినప్పుడు దొంగతనమైనను చేయగోరుట.

ధనవ్యసనం—ధనముసంపాదించవలెనని లోభకాంచతోనుండుట.

జాజవ్యసనం——మనోత్సాహమునునొంది వాహానవస్త్రాభరణము లను ధరించి యేమో యెట్లాగో అవునో కాదో యని మనంబున చింతించుట.

విశ్వవ్యసనం——మోక్షము సాధించవలెననియు దివ్య క్షేత్రంబు లకు బోవలెననియు జింతించుట.

ఇరువదియైదు తత్త్వములు గూడిన చక్రము

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆకాశ పంచకము | జ్ఞానం | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | అంతరేంద్రియములు |
| వాయు పంచకము | సమాన వాయువు | వ్యాన వాయువు | ఉదాన వాయువు | ప్రాణ వాయువు | అపాన వాయువు | ప్రాణేంద్రియములు |
| అగ్ని పంచకము | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము | జ్ఞానేంద్రియములు |
| ఉదక పంచకము | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము | పంచతన్మాత్రము |
| పృథివి పంచకము | వాక్కు | పాణి | పాదము | గుహ్యము | గుదము | కర్మేంద్రియములు |
| | ఆకాశ తత్త్వములు | వాయు తత్త్వములు | అగ్ని తత్త్వములు | ఉదక తత్త్వములు | పృథివి తత్త్వములు | సమిష్టి తత్త్వములు |

## జ్ఞానేంద్రియములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| శ్రోత్రేంద్రియమునకు | ఆకాశభూమి | దశదిక్కులు ఆది దేవత | శబ్దమే విషయము | ఉ.రాక్షరములు | ౨ | శబ్దభేదములు |
| త్వగేంద్రియమునకు | వాయుభూతం | రుద్రుడు ఆది దేవత | స్పర్శమే విషయము | శీతం–ఉష్ణం మృదువు కఠినం | ౪ | స్పర్శభేదములు |
| చక్షురింద్రియమునకు | అగ్నిభూతం | సూర్యుడు ఆది దేవత | రూపమే విషయము | శ్వేత–పీత హరిత–రక్త | ౬ | రూపభేదములు |
| జిహ్వేంద్రియమునకు | ఉదకభూతం | వరుణుండు ఆది దేవత | రసమే విషయము | మధుర–అమ్ల తిక్త–కటుక–కాషాయ–లవణం | ౬ | రసభేదములు |
| ఘ్రాణేంద్రియమునకు | పృథివిభూతం | అశ్విని దేవతలు ఆది దేవతలు | గంధమే విషయము | సుగంధము దుర్గంధము | ౨ | గంధభేదములు |

## కర్మేంద్రియములు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| వాగింద్రియమునకు | నాగవాయువు | సరస్వతి ఆది దేవత | వచనమే విషయం | సువాఖ్యాము దుర్వాఖ్యాము | ౨ | వచనభేదములు |
| పాణీంద్రియమునకు | కూర్మ వాయువు | దేవేంద్రుడు ఆది దేవత | దానమే విషయం | దానాదానములు | ౨ | దానభేదములు |
| పాదేంద్రియమునకు | కృకర వాయువు | విష్ణువు ఆది దేవత | గమనమే విషయం | గమనాదానములు | ౨ | గమనభేదములు |
| గుహ్యేంద్రియమునకు | ధనుంజ వాయువు | బ్రహ్మప్రజాపతి ఆది దేవత | ఆనందమే విషయం | ఆనందములు కేవలానందము | ౨ | ఆనందభేదములు |
| వాయునింద్రియమునకు | దేవదత్త వాయువు | మృత్యువు ఆది దేవత | విసర్జనమే విషయం | విసర్జన | ౧ | మలవిసర్జన |

పంచభూతములవలన పుట్టిన వివరములు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| పృథివి వల్లను | అస్థి | నాడ్రము | [illegible] | వరవములు | రోమకూపములు | ౪ | కలిగెను |
| ఉదకము వల్లను | రక్తం | మూత్రము | శుక్లము | శ్లేష్మం | చెమట | ౫ | కలిగెను |
| అగ్ని వల్లను | క్షుత్తు | దాహము | నిద్ర | అలసత్వం | సంగమము | ౫ | కలిగెను |
| వాయువు వల్లను | చలనం | గమనము | తీవ్రము | లజ్జ | పరుగము | ౫ | కలిగెను |
| ఆకాశము వల్లను | కామం | క్రోధము | లోభం | మోహం | భయము | ౬ | కలిగెను |

ఉత్సాహావ్యసనం—ప్రోత్సాహము కలిగినప్పుడు పుత్రమిత్ర కళత్రాదులమీద వాంఛించుట.

సేవకావ్యసనం—పోమెనను వచ్చెదను యిచ్చెదను పుచ్చుకొనెద నని వినయము బొందుట.

దశవిధనాడుల వివరం

౧ ఇడానాడి – అనగా చంద్రనాడి – ఎడమభాగమం దుండును శివుడు ఆదిదేవత.

౨ పింగళనాడి – అనగా సూర్యనాడి – కుడిభాగమం దుండును విష్ణువు ఆదిదేవత.

౩ సుషుమ్నానాడి – అనగా అగ్నినాడి – మధ్యమం దుండును బ్రహ్మం ఆదిదేవత.

౪ గాంధారినాడి – అనగా కుడినేత్రమం దుండును – ఇంద్రుడు ఆదిదేవత.

౫ హస్తినినాడి – అనగా జిహ్వాయందుండును, యెడమ నేత్రమం దుండును వరుణుడు ఆదిదేవత.

౬ పూషానాడి–కుడికర్ణమందుండును, దిగ్దేవత ఆదిదేవత.

౭ పయస్వనీనాడి–ఎడమకర్ణమందుండునుపద్మోద్భవుడుఆదిదేవత

౮ అలంబసనాడి–మెడయందుండును వస్వానరుడు ఆదిదేవత.

౯ కుహూనాడి–గుదస్థానమందుండును భూమి ఆదిదేవత.

౧౦ శంఖినీనాడీ–నాభిస్థానమందుండును చంద్రుడు అధిదేవత.

దశవిధవాయువులవివరం – వాటిలో పంచప్రాణములు.

౧ సమానవాయువు నీలవర్ణము నాభిస్థానమందుండి ఆపాదమస్తక పర్యంతమును వ్యాపించి అన్నము మొదలగు సమస్తపదార్థము లయొక్క సారమును సమస్తనాడులకు పంచిపెట్టును.

౨ వ్యానవాయువు—గోక్షీరవర్ణం సర్వాంగమును వ్యాపించి దేహమంతట నిండియుండును.

3 ఉదానవాయువు సామీరవర్ణం కంఠమందుండి కఫము దగ్గును పుట్టించును రుచులు గోచరించును అన్నరసమును ఆత్మకుపానము జేయించును కలువరించును.

౪ ప్రాణవాయువు—ఇంద్రనీలవర్ణం హృదయమునందుండి అంగుష్టలు మొదలు వీణాగ్రపర్యంతము వ్యాపించి ఉచ్ఛ్వాస నిశ్వాసములచేత అన్నమును జీర్ణము చేయించును.

౫ అపానవాయువు—హరిత వర్ణము గుదస్థాన మందుండి మలమూత్రములను విడిపించి అధోద్వారమును బంధించి అన్నరసమును వ్యాపించి సకల రోమనాడులయందు వ్యాపించును.

ఉపవాయువులు – అయిదు

౬ నాగవాయువు—పీతవర్ణము చలనము లేక గీతరాగాదులను చేయించును రోమనాడులయందుండును.

౭ కూర్మవాయువు—శ్వేతవర్ణము పాదములయందుండి శుష్కమైన దేహము పుష్టిచేయించును కన్నులు నోరు మూయించును తెరపించును కర్తయై యుండును.

౮ కృకరవాయువు–రక్తవర్ణము నాసికాగ్రముందుండి క్షుతాది ధర్మములను బుట్టించును గమనాగమనములు జేయించును.

౯ దేవదత్తవాయువు – స్ఫటికవర్ణము గుహ్యానేత్రము యందుండి కూర్చుండిన చోటనే పరుండబెట్టును లేక నిలిపించును వ్యక్తముగా మాట్లాడించును.

౧౦ ధనుంజవాయువు–నీలవర్ణము బ్రహ్మస్థానమందుండి కర్ణరంధ్రములలో ప్రవేశించి సముద్రముభంగి చిత్ర విచిత్రముగా ఘోషించును మరణకాలముకు ముందుగా నిర్ఘోషమై పోవును.

ఊర్ధ్వలోకములు

భూలోకం – గుదమందు జనలోకం – కంఠమందు

భువర్లోకం - గుహ్యమందు
సువర్లోకం - నాభియందు
మహర్లోకం - హృదయమందు
తపోలోకం - భ్రూమధ్యమందు
సత్యలోకం - లలాటమందు

అధోలోకములు

అతల - అరికాళ్ళయందు
వితల - మీగాళ్ళయందు
సుతల - మడిమలయందు
తలాతల - పిక్కలయందు
రసాతల - మోకాళ్ళయందు
మహాతల - తొడలయందు
పాతాళ - గుదమందు

సప్తద్వీపములు

జంబుద్వీపము - తలలోను
పక్షుద్వీపం - అస్థులు
శాఖద్వీపం - శిరస్సున
శాల్మిద్వీపం - చర్మమున
పుష్కరద్వీపం - గోళ్ళయందు
కుశద్వీపం - మాంసమందు
క్రౌంచద్వీపం - వెంట్రుకలందు

సప్తసముద్రములు

లవణసముద్రం - మూత్రం
ఇక్షుసముద్రం - చమట
సురసముద్రం - యింద్రియం
సర్పిసముద్రం - శోణితం
దధిసముద్రం - శ్లేష్మం
క్షీరసముద్రం - సొల్లు
శుద్ధోదకసముద్రం - కన్నీరు

షడూర్ముల వివరము

| | | |
|---|---|---|
| ఆకలి | దప్పి | ప్రాణధర్మములు |
| శోకము | మోహము | మనోధర్మములు |
| జన్మము | మరణము | దేహములు |

షడ్భావముల వివరము

| | | | |
|---|---|---|---|
| అస్తి | గర్భమందుండుట | జాయతే | పుట్టుట |
| వర్ధతే | పెరుగుట | పరిణమితే | వృద్ధిపొందుట |
| యపక్షీయ్యతే | కృశించుట | వినశ్యతే | నశించుట |

## దేహత్రయ వివరము

| దేహత్రయ | అవస్థా త్రయము | ఆత్మా త్రయము | స్థాన త్రయము | అభిమాన త్రయము | గుణ త్రయము | వర్ణ త్రయము | దైవ త్రయము | మాతృకా త్రయము |
|---|---|---|---|---|---|---|---|---|
| స్థూలము | జాగ్రత | జీవాత్మ | నేత్రము | విశ్వుడు | రాజసము | రక్తవర్ణం | బ్రహ్మ | అకారము |
| సూక్ష్మము | స్వప్నం | అంతరాత్మ | కంఠము | తైజసుడు | సాత్వీకము | శ్వేతవర్ణం | విష్ణువు | ఉకారము |
| కారణము | సుషుప్తి | పరమాత్మ | హృదయం | ప్రాజ్ఞుడు | తామసము | నీలవర్ణం | రుద్రుడు | మకారము |

ఓంకార ప్రకరణము

| | | | |
|---|---|---|---|
| అకారం | బ్రహ్మా | పీతవర్ణం | నాదు |
| ఉకారం | విష్ణు | శ్వేతవర్ణం | బిందు |
| మకారం | శివుడు | కృష్ణవర్ణం | కళ |

అష్టమదములు

| | | | |
|---|---|---|---|
| కులమదం | ధనమదం | యవ్వనమదం | రాజ్యమదం |
| చలమదం | రూపమదం | విద్యామదం | తపస్సుమదం |

తాపత్రయముల వివరణము

అధ్యాత్మిక తాపము – తలనొప్పి – కడుపునొప్పి – చలి జ్వరాదులవల్ల వచ్చెడి ఉపద్రవములు అగును.

ఆదిభౌతిక తాపము – చోర – వ్యాఘ్ర – సర్ప – వృశ్చిక–పిపీలకాదులవల్ల వచ్చెడి ఉపద్రవములు అగును.

ఆదిదైవిక తాపము – ఎండ – గాలి – వాన – పిడుగులు – వీనివల్ల వచ్చెడి వుపద్రవములు అగును.

సప్తధాతువుల వివరము

రసము – రుధిరము – మాంసము – మేధస్సు – అస్తి – మజ్జ – శుక్లము – యీ తత్వములతో కూడిన శరీరము.

జ్ఞానేంద్రియ పంచక చేష్టలు

త్వక్కునకు విషయము – స్పర్శము – వాయుసంబంధమై అన్నిటి యొక్క శీతోష్ణాది లక్షణ మెరుగును.

చక్షువునకు విషయము–దృష్టి–అగ్నిసంబంధమై సమస్త ప్రపంచమును చూచును.

శ్రోత్రమునకు విషయము–శబ్దము – ఆకాశసంబంధమై సకలమైన ధ్వనులను వినుచుండును.

జింహ్మకు విషయము – రసము – అప్పుతో గూడుకొని నానా రుచుల నెరుంగును.

ఘ్రాణమునకు విషయము–గంధము–పృధివితో సంబంధమై సుగంధ దుర్గంధముల నెరుంగును.

## కర్మేంద్రియ పంచక చేష్టలు

వాక్కునకు విషయము - వచనము - ఆకాశసంబంధమైన సకల శబ్దముల నుచ్చరించును.

పాణికి విషయము - దానము- ప్రతిగ్రహములు అగ్నిసంబంధము తాను ఒకరికిచ్చుటయు యితరులయొద్ద తాను పుచ్చుకొనుటయు నను గార్యము గలదిగా నుండును.

పాదమునకు విషయము—గమనము - వాయువు - సంబంధమై అన్నిచోట్ల తిరుగుచుండును.

వాయువునకు విషయము—విసర్జనము - ఉదక సంబంధమై భుజించిన పదార్థములను వెలిచేయుచుండును.

ఉపస్థకు విషయము—సంగమము-పృథివి సంబంధమై మూత్ర విసర్జనము జేయుచు ఆనందమునం దభిలషితమై యుండును.

## జ్ఞానేంద్రియ పంచకలీనము

స్పర్శము—వాయువునందు - చర్మమందును - అణగును.
రూపము—అగ్నియందును - కన్నులయందును - అణగును.
రసము—ఉదకమందును - నాలుకయందును - అణగును.
గంధము—పృథివియందును - ముక్కునందును - అణగును.
శబ్దము—ఆకాశమందును - చెవియందు - అణగును.

## కర్మేంద్రియ పంచలీనము

వచనము—ఆకాశమందును - నోటియందును - అణగును.
గమనము—వాయువునందును-పాదంబులయందును-అణగును.
దానము—అగ్నియందును - హస్తమునందును - అణగును.
విసర్జనము—ఉదకమునందును - గుదమునందును - అణగును.
ఆనందము—పృథ్వియందును - ఉపస్థయందును - అణగును.

## దశవిధ నాదములు

| జలధి నాదం | భేరి నాదం | చిణీ నాదం | మృదంగ నాదం | ఘంటా నాదం |
|---|---|---|---|---|
| కహళ నాదం | కింకిణీ నాదం | వేణు నాదం | భ్రమర నాదం | ప్రణవ నాదం |

## అంతఃకరణ చతుష్టయము చేష్టలు

మనస్సు—సంశయించును.
బుద్ధి—నిశ్చయించును.
చిత్తము—చింతన చేయుచుండును.
అహంకారము—నేను అని పలుకుచుండును.

## రాజయోగ భేదములు

సాంఖ్యమనియు, తారకమనియు, అమనస్కమనియు రాజయోగమందు భేదంబులు మూడు గలవు.

## ౧—సాంఖ్యయోగ లక్షణము

ఇదివరలో జెప్పిన పంచవింశతి తత్వముల లక్షణమును చక్కగా దెలిసికొని ప్రధానతత్వమైన పరబ్రహ్మమును సదా ధ్యానము జేయుటయే సాంఖ్య యోగమనంబడును మరియు యేవస్తువునుగురించి తాను దెలుసుకొనవలయునను అభిలాషతో యెంచుకొనుచుండునో అదియే సాంఖ్య మనుపించుకొనును.

## తారకయోగమనగా

మంత్రంబులు యేడుకోట్లు గలవు వీనిలో తనకిష్టమైన దేవతా మంత్రంబులను జపియించుట మంత్రయోగమనబడును మరియు యజ్ఞయాగాదులయందు నిత్యకృత్యాదులయందును ఆ యా మంత్రంబులను నోటితో నుచ్చరించుటయును మంత్రయోగమనబడును. ఇట్లుగాక షడాధారంబులకు చెప్పియుండు చొప్పున ఏయే చక్రమునం దేయే దేవతులకు యెన్ని మార్లు ఆ జపమంత్రమును జెప్పబడియున్నవో ఆలాగు జపియించుటయే ప్రధానమైన మంత్రయోగ మనబడును.

## ౨—తారకయోగ లక్షణము

మోక్షాపేక్షగలవాడు రాజయోగము ననుసరించవలెను. అందు జెప్పబడిన మూడుయోగములలో, సాంఖ్యము పరబ్రహ్మ స్వరూపమిట్టిదని తెలియుచేయును అమనస్కము నీవె పరబ్రహ్మమని నిర్ణయించును తారకము మనస్సును పరిశుద్ధంబు జేయునట్టిదియును తరింప జేయునట్టిదియునై యదిగనుక తారకంబునకు మించినయోగము లేదు.

## ౩—అమనస్కయోగ లక్షణము

శుచిర్భూతుండై నిశ్శబ్ధమగు స్థలమునందుగూర్చుండి మనస్సును చలింపనీయక తనకును పరమాత్మునకును భేదంబున్న దనెడు మనస్సు

యొక్క సంశయము తొలగి పరమాత్మయే తానని యెప్పుడు భావించుటకు గల్గునో అట్టిస్థితియే అమనస్క మనబడును.

౧౦౦—ముఖ్యమైన మూడు నాడుల వివరము

ఇడానాడి—కైలాసగిరి పింగళనాడి — మందరగిరి — సుషుమ్న నాడి మహామేరువు.

ఇడానాడి—గంగానదియనియు, పింగళనాడి—యమునానదియనియును, సుషుమ్న నాడి—సరస్వతియనియును, నామంబులు గలవు మరియు త్రికూటమనియు, శృంగాటకమనియును, నాదుబిందు కళలనియును సూర్యచంద్ర అగ్నిమండలంబులనియును, ఆనాడులు మూడింటికి క్రమముగా పేర్లుగలవు యిందుకు గారణం బీక్రింద వివరింపబడుచున్నది. ఇడా నాడి దక్షిణ నాసికయందలి శ్వాసము, పింగళనాడి వామ నాసికశ్వాసము. ఈరెండు కూడినట్టిస్థానము సుషుమ్న నాడి యనబడును. కుడికన్ను గంగానది, ఎడమకన్ను యమునానది. ఈరెండు చేరినచోటు సరస్వతీ నది అనగా రెండుకొనళ్ళకు మధ్యస్థానమని తెలిసేది. ఇట్లు కూడునట్టి దానికి త్రికూటమనియును శృంగాటకమనియును పేర్లుగలిగెను. మరియు ఇట్లు త్రకూట స్థానంబునందు మూలాధారాది పంచ కమలములనుదాటి షట్కమలమందు హంసనామంబుతో ప్రణవాత్మకమగు పరమాత్మ ప్రకాశింపుచున్నాడు అదే పరబ్రహ్మము. ఆపరబ్రహ్మంబును హంసయని చెప్పంబడుటకు గారణం బేమనగా సరస్వతీయనే నదిలో పుష్పించిన సహస్రార కమలంబును వికసింప జేయునట్టి సూర్యునివంటివాడు గనుక ఆపేరు గలిగెను మరియు సోహం అనే వాచకంబునకు గురియైన వాడైనందున ఆనామము గలిగెను.

౧౦౧—షడాధారముల స్థాన హంసంబుల వివరము

ఆధారచక్రంబు గుదస్థానంబున నాలుగు దళంబులచే వ—శ—ష—స ఈ నాలుగు స్వరూపంబులుగలిగి (ఓం) అను బీజాక్షరం అర్ధచంద్రాకారం పీతవర్ణం కుంకుమ కాంతి కింకిణీనాధం క్రియాశక్తి భూలోకం ఆరునూరు ప్రణవము ఆదిదేవత విఘ్నేశ్వరుడు.

స్వాధిష్ఠాన కమలం గుహ్యస్థానం అనగా లింగస్థానం షడ్దళంబులచే—బ—భ—య—ర—ల యీ యారుస్వరూపంబులచే (న) అనుబీజాక్షరము గల స్వాధిష్టకమలం త్రికోణాకృతి శ్వేతవర్ణ విద్యుత్కాంతి వీణారవం జ్ఞానశక్తి భువర్లోకం ఆరువేల ప్రణవము ఆదిదేవత బ్రహ్మ.

మణిపూరకం నాభిస్థానమున పదిదళములచే డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-యీ పది స్వరూపములు గలిగి (మ) అను బీజాక్షరంగలపద్మో ణాకృతిచే శ్యామలవర్ణం రక్తకాంతి వేణునాధం ఇచ్ఛాశక్తి సువర్లోకం ఆరువేల ప్రణవము ఆదిదేవత విష్ణువు.

హృదయస్థానమున పండ్రెండు దళములచే అనాహత కమలం క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ యీ పండ్రెండు స్వరూపములు గలిగి (శి) అని బీజాక్షరముచే వర్తులాకారం నీలవర్ణం శాంతకుంభవు కాంతి శంఖుఘోష ఆదిశక్తి మహర్లోకం ఆరువేల ప్రణవము ఆదిదేవత రుద్రుడు.

కంఠస్థానము పదహారు దళములుగలిగి అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-అం-అః అను పదహారు దళములు గలిగి (వ) అను బీజాక్షరముచే విశుద్ధకమలమందు ధూమ్రవర్ణం మేఘనాదం షోడశ స్వరములు పరాశక్తి జనర్లోకం వెయ్యి ప్రణవము ఆది దేవత సదాశివుడు.

త్రికూటస్థానమున రెండుదళములు గలిగి హం-క్షం యీ రెండు వర్ణములుగలిగి (య) అను బీజాక్షరముగల ఆజ్ఞేయ కమలమునందు సర్వవర్ణములుగలిగి సముద్రఘోష భ్రూమధ్యమాణిక్య కాంతిచే గంగా యమునా సరస్వతీ సంగమస్థానం తపోలోకం ఆత్మకు వెయ్యి ప్రణవములు గలిగి ఆదిదేవత యీశ్వరుడు.

ఫాలభాగమున వేయి దళములు గలిగి-రాం-బీజముగలిగి సహస్రార కమలమునందు చిత్రవర్ణముజాంకారనాధముసత్యలోకము వేయి ప్రణవములు ఆదిదేవత సద్గురుస్వామి.

౧౦.౨: రాగద్వేషాదుల వివరము

రాగము ద్వేషము కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ఈర్ష్య అసూయ డంభము దర్పము అహంకారము అని పదమూడు విధములు.

అందు రాగమనగా పరస్త్రీ విషయముగా గలిగెడు చిత్తవృత్తి యిందువలన మహా బలశాలియగు రావణుడు సీతాదేవిని చెరబట్టి పుత్రమిత్ర భ్రాత్రు బంధు పరివారములతో గూడా మడిసెను.

ద్వేషమనగా ఒకప్పుడు వుపకారము చేయగా వానికి మరల అపకారము చేయవలెననెడి చిత్తవృత్తి యిందువలన హిరణ్యకశిపుడు దురా

చారుడైన తనయనుజుని వరాహరూపుడైన హరిని పోరుగొననని ద్వేషించి దూషించి ఆ మాధవుని వధింప శపథంబుజేసిన ఆ నారాయణుండు నారసింహ్మరూపము చేత వానిని సంహరించెను.

కామమనగా ఇండ్లు తోటలు నాణ్యములు ధనములు ధాన్య పశువులు స్త్రీలు మొదలగు వానిని యెక్కువగా సంపాదింపవలయు ననెడి చిత్తవృత్తి దీనివలన నరకాసురుడు అనేక స్త్రీలనుదెచ్చి చెర బెట్టినందున శ్రీకృష్ణమూర్తి వానిని వధించెను.

క్రోధమనగా తాను జేయునట్టి పనులకు విఘ్నము చేయువానిని యుగ్రముగా గలిగెడి చిత్తవృత్తి ఇందువలన బకాసురుడు యేకచక్ర పుర నివాసులగు బ్రహ్మణులను బాధించుచుండ వారల ప్రేరేపంబున భీముం డారక్కసుని చోక్కాడెను.

లోభమనగా తనకు లభించిన పదార్థముల నితరుల కివ్వకూడదను చిత్తవృత్తి యిందువలన రాజరాజగు దుర్యోధనుడు తనజ్ఞాతులను పాండవుల కివ్వవలసిన సగము భాగము ఇవ్వనందున పుత్రమిత్ర సహోదర బంధువులతోడ మడిసెను.

మోహమనగా పుత్రకళత్ర ధనాదులయందు మిక్కుటపు ప్రేమ గలిగి యుక్తాయుక్తముల నెరుగని చిత్తవృత్తి యిందువలన దశరథమహారాజు తన భార్యయగు కైకయందలి ప్రేమచేత సత్యసీలాది సద్గుణనిధియైన శ్రీరాముని అడవులకుబంపి అందున తానును మృతినొందెను.

మదమనగా సకలసంపదలు గలిగి గర్వించి నేనేమి జేసినను చెల్లునని ఆలోచనతోచెడు చిత్తవృత్తి, ఇందువలన జమదగ్ని మహాఋషి యొక్క కామధేనువు కార్తవీర్యార్జునుని పుత్రుడు తనతండ్రియగు కార్త్యవీర్యుడును నీల్గిరి.

మాత్సర్యమనగా యితరులు తనకంటే నెక్కువగు విద్యయును అయిశ్వర్యయును చక్కదనమును భోగమును యశస్సును శరీరబలమును పరాక్రమమును గలవారై యుండగా జూచి యోర్వజాలక మండిపడే చిత్తవృత్తి, యిందువలన శిశుపాలుడు ధర్మరాజు జేయు రాజసూయ యాగమందు కృష్ణుని వైభవముజూచి వోర్వక తిట్టి చక్రాయుధము చేత గిట్టెను.

ఈర్ష్యమనగా నాకు యిచ్చిన కష్టములు యితరులకు రావలయునను చిత్తవృత్తి, ఇందువలన అరుణాక్షుడనువాడు తనలో సమానుడగు బాణునకు దుఃఖములు రాగోరి అతనిచేత ప్రాణములు గోలుపోయెను.

అసూయ యనగా తనకు గలిగిన సుఖములు యితరులకు గలుగ రాదు అను చిత్తవృత్తి, ఇందువల్ల పౌండ్రిపదేశపురాజగువాసుదేవుడను పేరు నాకు తగునుగాని మరియొకనికి తగునా యనెడు విరోధముచేత వాసుదేవుడైన శ్రీకృష్ణభగవానునితో మత్సరించి చచ్చెను.

డంభమనగా తానుజేసిన పనులు పదులెరిగి హెచ్చుగా మెచ్చ వలయునని చిత్తవృత్తి ఇందువల్ల అపూర్వుడు తనయాగమును జూడుమని దుర్వాసునితో బలికిన అతడు ఇది డంభమనగా అందుకు అపూర్వుడలిగి దుర్వాసుని దూషించి విఫలమునొందెను.

దర్పమనగా నేను సర్వవిషయములయందు సమర్థుడ నాకు సాటి యిన మేటి యేచోటను లేదను చిత్తవృత్తి, ఇందువలన త్రిలోక కంటకుడైన దశకంఠుండు క్రొవ్వి యెవ్వరిని చవ్వచేసి నాకెవ్వరీతిని తిరుగు చుండ విష్ణుదేవుడు శ్రీరాముడై యుదయించి శరంబున వానిని వధియించెను.

అహంకారమనగా వోరీ నిన్ను శిక్షించువాడనని ఎరుగవా నేను పట్టినపట్టు తుదముట్టింప నట్టనడుమ విడచిపెట్టు వాడనుగాను యని యితరుల వధియించు చిత్తవృత్తి, దీనివలన మధు కైటములు అనెడి టక్కరి రక్కసుల అహంకరించి విష్ణుదేవునితో కలహించి గాలము చేసిరి గనుక బుద్ధిమంతులగు భగవత్ భక్తులను ముముక్షువులునయిన వారు యీదుర్గుణములును వద్ద చేరనివ్వక పెద్దలనుసేవించుచూ నుండవలెను.

## ౧౦౩—రేచక - పూరక - కుంభకాదులకు వివరము

ప్రాణాయామమనగా రేచక పూరక కుంభకములు, రేచకమనగా యేరువు శ్వాసమువిడుచుట, పూరకమనగా తెలువు శ్వాసము యెక్కుట కుంభకమనగా నలువు రేచక పూరకంబులు పుట్టినస్థానమందు ఈరెండు నిలిపినదే కుంభకము యిదే ప్రాణాయామము.

## ౧౦౪—అండపిండ బ్రహ్మాండములకు వివరము

### బాహ్యమునకు

అండాండమనగా భూచక్రం పృథివికెల్లను, పిండాండ మనగాస్థావరములు పర్వతములు మొదలైన చరాచరములు బ్రహ్మాండ మనగా ఆకాశము.

## లక్ష్యార్థము

అండాండ మనగా కనుగుడ్డు, పిండాండ మనగా బిందువనేపాప, బ్రహ్మాండ మనగా పాపమధ్య వెలిగేకళ, ఆ కళలో నిమ్కళే పర బ్రహ్మము.

## ఇక పంచభూతముల వివరము

పృథివి అనగా చుట్టుయుండే యెరుపు తెల్లగుడ్డే పురకం, పైన నలుపు అగ్ని, అందులో నీలమైనపాపే వాయువు, అందులో కళే ఆకాశము ఆకళలో నిమ్కళేతాను.

## త్రివేణులకు వివరము

పైనలుపు గంగ, ఆనలుపుతో సునీలమైన కుండలనేటి పాపేయమున, ఆపాపే నీలయతోయడ మధ్యస్తం, ఆపాప మధ్యమున వెలిగే వెలుగు సరస్వతి, అదే విద్యుల్లేక, ఆవెలుగులో నిమ్కళే తాను అదే ముక్తికాంత, చుట్టూయుండేయెరుపు బ్రహ్మ, తెల్లగుడ్డు విష్ణువు పై నల్లగుడ్డు రుద్రుడు, యిది హృదయకమలం యెరుపు అయిన బ్రహ్మకు అకార మాత్రిక, తెలుపు అయిన విష్ణువునకు ఉకారమాత్రిక, నలుపు అయిన రుద్రునకు మకారమాత్రిక, నిద్రాసంగమాధులను అక్కడనే పుట్టును.

## పంచశక్తుల వివరము

యెరుపు క్రియాశక్తి, తెలుపు జ్ఞానశక్తి, నలుపు యచ్ఛాశక్తి, సునీలమైన పాప ఆదిశక్తి, ఆపాప మధ్యమున వెలిగేకళ పరాశక్తి, ఆ కళలోని నిమ్కళే తాను

## మండల త్రయముల వివరము

పై నలుపు అగ్నిమండలం, పాపే సూర్యమండలం, సునీలమైన బిందువే చంద్రమండలం, అందులో కళే సకలప్రపంచమున్ను అదేధూమ్రమండలం, ఆకళలో నిమ్కళే యెరుక మరుపులు అంతా యెరిగేది తాను.

## ౧౦౫—వాసన త్రయముల వివరము

లోకవాసన దేహవాసన శాస్త్రవాసన అని మూడు విధములు లోకవాసననగా సమస్తమైన వారున్ను స్తోత్రం చేయవలసినది యెవరు నిందించకుండా యెట్లా యుందురో అట్లుండవలెను అనేదే దీనికి వృత్తి

అనగా బ్రహ్మాదులుకూడా నిందింప బడ్డారు. అల్పులమైన మనము నిందించడమునకు జెప్పవలెనా అనిన్ని వకవేళ నిందిస్తే స్థూలదేహాన్ని నిందింతురు, దాన్ని మనమున్నూ ఒకానొక సమయమునందు నిందిస్తూయున్నాము గనుక ఆనందించడమునకు మనకు సహజమేను. సూక్ష్మకారణ దేహాలు అగుపడవు గనుక వాటిని నిందించడము లేదు. ఆత్మను నిందిస్తే ఆత్మ నిత్యాత్మకుడైనందువలన తన్ను తానే నిందించుకున్నట్టు అని అట్లా ఓర్చుకోవడమే నివృత్తి.

దేహవాసనవనగా ఆయుస్సు అధికముగా సంపాదించవలెనని ఆరోగ్యము సంపాదించవలెనని సౌందర్యము సంపాదించవలెనని యిచ్ఛవుండడమే.

దీనికి వృత్తియనగా యోగాభ్యాసముచేసి ఆయుస్సు అధికముగా సంపాదించుదామంటే ఆయుస్సు అతిశయమువలన మోక్షము రానేరదు ఆరోగ్యము పురుష ప్రయత్నంబుచేత సిద్ధించకపోయినా హర్షశోకాలు అంతఃకరణకేగాని ఆత్మయయిన నాకు లేదు. సౌందర్యము పురుషుల యందు కాలాంతరేణ అకురూపత్వ ప్రాప్తి కన్నారము గనుక సౌందర్యంబు సంపాదించడము వ్యర్థమేను అని నిశ్చయించడమే నివృత్తి.

శాస్త్రవాసననగా శాస్త్రంబులు చదివి ఆ శాస్త్రంబులు శిష్యులకు పాఠంబులకు జెప్పవలెనని నిశ్చయించడమే నివృత్తి.

## ౧౦౬—అష్టాంగ యోగంబుల వివరం

యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన దారణ సమాదులనెడు అష్టాంగ యోగములను నిరూపించుచున్నారము యమ మనగా యేమంటే సమస్త నామరూపాత్మకమైన ప్రపంచము బ్రహ్మమేను. ఆ బ్రహ్మముకంటే అన్యమైన వస్తువు లేదని నిశ్చయించడమే నివృత్తి. నియమమనగా నేను, అనగా యెవరు ముక్తి అనగా యెట్లుకలుగుతున్నది. నాకు సంసారము యెట్లు కలుగుతున్నదని యాలోచనచేయడమే నివృత్తి, ఆసనంబనగా యేమంటే సమస్తవస్తువులయందు ఆశక్తి లేక ఉదాసీనంగా వుండడమే నివృత్తి, ప్రాణాయామమనగా నామరూపాత్మకమైన జగత్తు, మిథ్యాభూతంబని నిశ్చయించడమే నివృత్తి, ప్రత్యాహారమనగా దేహాదులయందు నేను అని పొందబడిన మనస్సును మళ్ళించి అద్వితీయుడైన ఆత్మయందు నిలుపడమే నివృత్తి, ధ్యానమన

గా సచ్చిదానంద స్వరూపుడని దేశకాలవస్తు పరిచ్ఛేద రహితుడై వుండే వాడని పరిపూర్ణ బ్రహ్మస్వరూపము నేనని అనుసంధానము చేయుడమే ధ్యానము, ధారణయనగా దేహయాత్రలు నేను కాదు, అవస్థాత్రయాలు నేను కాదు, పంచకోశాలు నేను కాదు. చతుర్వింశతి తత్త్వాలు నేను కాదు, అనృత జడ దుఃఖాత్మకమైన మాయ నేను కాదు, సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మ నేననడమే ధారణ. సమాధి యనగా స్థూల శరీరము జాగ్రదవస్థ విశ్వుడు ఈ మూడు అకారము సూక్ష్మ శరీరము స్వప్నావస్థ తైజసుడు ఈ మూడు ఉకారము కారణశరీరము సుషుప్త్యవస్థ ప్రాజ్ఞుడు ఈ మూడు మకారము ఆకారాన్ని సచ్చిదానంద స్వరూపమైన బ్రహ్మముగా భావనచేసి ఆ బ్రహ్మయే నేనని అనుసంధానము చేయడమే సమాధి.

## వైరాగ్యమనగా

ఉపవాస వ్రతములుండుటకాదు నీమ నామములుండుట కాదు జడలు ధరించుటకాదు, వ్యాఘ్రచర్మమునం దుండుటకాదు రుద్రాక్షలు వేయుటకాదు భస్మము బూసుకొనుటకాదు సంసారమును విడచిపెట్టుట గాదు తీర్థయాత్రలు సేవించుటగాదు వనములోనుండి కందమూలములు భక్షించుటగాదు ధనధాన్యంబులు దారబోయుటగాదు తీవరాభ్యాంజన ములను మరచుటగాదు దారాపుత్రాదులను విడుచుటగాదు మోహరహితుడై యుండవలెననుటగాదు వైరాగ్యంబనగా యేమంటే పైఅర్థమై ఈ ప్రపంచమందు రాగంవిడుచుటయే వైరాగ్య.

## ౧౦౭ - కామవృక్షము వివరము

కామమనెడి ఒక వృక్షంబగును ఆవృక్షము మోహంబనెడి విత్తు వలన బుట్టినదియగును పొరబాటనెడి నీళ్ళచేత తడపబడి, ఆకామవృక్షము వృద్ధిబొందుచున్నవి. ఆ కామవృక్షమునకు అజ్ఞానము వేళ్ళయగును, ఆకామవృక్షము అసూయలనెడి ఆకులుగలిగి విచిత్రమైయుండి అభిమానంబనెడి దృఢమైన స్కంధమును గలిగియున్నది. కొమ్మలక్రింద నున్నట్టియు వేరులకుపైన నున్నట్టియు యిట్టి మొద్దు స్కంధమనబడును మరియు ఆ కామ వృక్షమునకు దుఃఖము కొమ్మలగును చింతలు చిన్న కొమ్మలగును ముందు చేయబడిన కర్మము యీ వృక్షముయొక్క పొదుగగును అట్టి కామవృక్షమందు ఆశయనెడు మరియొక తీగ అల్లియుండును. ఇట్టి కామవృక్షముయొక్క పండ్లుకొరకు లుబ్ధులగు జనులు ఆ వృక్షము

నకు పాకి పెరిగి పడుదురు వివేకి యగువాడు వైరాగ్యమనె ఆయుధము జేత, యీ కామవృక్షమును నరికివేసి సంసారదుఃఖమును విడచి సుఖించును.

౧౦౮—గృహాస్తాన ధర్మము

జ్ఞానులగు మహాత్ములు మోక్షశాస్త్రములను పరిశోధించి జ్ఞానయోగమార్గమును కర్మరహితమగు జ్ఞానమర్గమును యివి మూడును జ్ఞానముద్వారా మోక్షసాధకము లగునని జెప్పెదురు, అందు కర్మరహితంబగు జ్ఞానమార్గము నా గురువునకు సమ్మతమైయున్నది గనుక గృహమందుండి నిత్యముక్తుడై యుండి మరియు గృహస్థాశ్రమమునందు కీడు గలుగునని దలచి సన్యాసాశ్రమమును బొందినయెడల అట్టివాడు గృహస్థ ధర్మంబును సమ్మతించక పోవుటయు కోరికయగును, అందుచేత అట్టివానికి అభిమానము విడువదు మరియు సన్న్యసాశ్రమ మందున్నవాడు కఱ్ఱయు కాషాయవస్త్రము, తలగొరిగించుకొనుటయు చేతియందు పాత్రముధరించుటయు రుద్రాక్షలు వేయుటకు విభూతిధరించుటయు యివి గలిగి యుండును యిటులు సన్యాసిగుర్తులు గలిగియుండుటచేత మోక్షము గలుగనేరదు గుర్తులుగల చిహ్నములకు అఖండజ్ఞానంబు గలిగించెడిశక్తి గలిగియుండలేదు సన్యాసి గురుతు వలన దుఃఖము బోవునని అట్టి గురుతులు ధరియించెదరు అవి దుఃఖంబును బోగొట్టజాలవు యట్లు పోగొట్టెడి పక్షమందు గృహస్తుడు పట్టుకొనెడి గొడుగును గృహస్థుని దుఃఖము పోగొట్టజాలదు. జ్ఞానమువలన మోక్షము గలుగునేగాని చిహ్నంబులును ధరించుటచేత మోక్షంబుగలుగనేరదు, అధిక తీక్ష్ణమగు కత్తిచేత రాజ్యంబనెడి బంధంబును రాగంబనెడి బంధమును సకలభోగంబులనెడి బంధంబులను నరకవచ్చును.

[బ్రహ్మజ్ఞానులు] ౧౦౯ – ఆత్మ వ్యవసాయము చేసే విమర్శన.

వవ్యసాయంబు సేయువిధము. మోక్షము సాధించు లక్షణము. అడవిలోనుండు చెట్టును నరికి మదిమనే యడవిని నరికి రాళ్ళ నన్నిటిని వేధించి అహంకారమనే రాళ్ళను చేధించి భూమిని సమముగాజేసి హృదయమను భూమిని సరసముజేసి గనిమిగట్టి మానమును గట్టుగట్టి విత్తనములు జల్లి జ్ఞానమను విత్తనమును నాటించి నీళ్ళను నిండారుగా కట్టి యిష్టమనే నీరునుబోసి, పండేవరకు పక్షులను రానివ్వక సాధించేవరకు మాయను చేరనివ్వక మంచముమీాద కాచియుండిన దృష్టియందు నిలిపి పండినవి కోసి భుజించు పథంబున పూర్ణానుభవమును జెందే విధము.

సీ॥ బ్రహ్మముఖమందునా । బ్రాహ్మణోత్తములును బాహువులయందు
నా క్షత్రియులును వూరువులాయందు। వైశ్యులు శూద్రులు పాదంబుల
యందు బుట్టిననిరి । యీనామములు వృత్తివలన । వచ్చెనుగానీ
బ్రహ్మపుట్టించి పేర్ । పెట్టలేదు జీవి నవలంబించి । వచ్చిన దంతేను
జీవి సమస్త । ఘటంబులుండు । ఘటము నవలంభించి వచ్చినదంతే
ను । అన్నిఘటములు పంచభూతములే । శరీరకాంతిచే వచ్చినదం
తేను । అన్ని తనువులు శుక్లసోణితములే॥ ఖర్మము నవలంభించి
వచ్చినదంతేను । ఆగామిప్రారబ్ధ మందరికిని । బ్రాహ్మణత్వము కుల
ము చేత వచ్చినదంతేను । ఋష్యశృంగుడు మృగంపునకు బుట్టె ।
కౌశికుడు దర్భయందునబుట్టె । వాల్మీకి బోయ కులమున బుట్టిననిరి
వ్యాసుడు బెస్తదానికిబుట్టె । మరియును గౌతముడు లేడిగర్భమున
బుట్టె । నక్కకు జాంబవంతుడుబుట్టె । నారదుడు చాకలదానికి బు
ట్టిననిరి అగస్త్యుడు కలశము లోపలబుట్టెను । ఊర్వశికి నా వసిష్టుడు
బుట్టె । నీచజాతులకుజన్మించినవానికి । బ్రాహ్మణత్వము వచ్చినటు
లయితె । మానవజాతులలో జన్మించెవారికి । బ్రాహ్మణత్వమును
రావలెను సుమ్మీ । కులమువల్లను వచ్చునని చెప్పరాదు । బ్రహ్మ
మెరిగినవాడెపో బ్రాహ్మణుండు । పనసచెట్టు తుదమొదల్ కాయ
లును । పనసకాయలందును ప్రభలముగను.

## ౧౧౦—ప్రాణములు పోయెడి ప్రదేశములు

పాదములను పిక్కలును మోకాళ్లును గుద్దయు ఉపస్థము తొడలును ప్రక్కలును బొడ్డును భుజములును రొమ్మును కంటమును ముఖమును చెవియును ముక్కును నేత్రములును శిరస్సును యివి ప్రాణము పోయెడి ప్రదేశములగును. వీనికి క్రమముగా విష్ణు వసు సాధ్య మిత్ర భూమి ప్రజాపతి మరుత్ సక్రందనస్థానం నరవిశ్వదేవదిక్ వాయువు సూర్య అశ్వి పితృ బ్రహ్మ అనెడి దేవతలు ఆదిదేవతలగుదురు. ఈ ఆదిదేవతలు ఆ యా ప్రదేశములందు ప్రకాశింపుచుండెదరు. హృదయమందుండెడి వాయువు ఆ యా దేవతలవలన నిలుచుచు వెళ్ళుచుండును యోగియగువాడు యిదియంతయు తెలుసుకొనియుండును.

## ౧౧౧—మరణ సూచిక

మరణసూచికములను యెరుగవలయును గనుక అవిచెప్పెద వినుము అరుంధతి యనెడి నక్షత్రమును చూచుటకు నేత్రమందు చూపుశక్తి

గలిగియుండియు కనబడకున్నను, ముక్కుమీద చెక్కుకట్టినట్లు తోచిన ను, పరిపూర్ణం చెంద్రుడు మలినముగా కనబడినను అట్టి ప్రాణికి నొక సంవత్సరకాలము ఆయుస్సు గలిగియుండును, మరియు కంటికి ముందు చెప్పిన ప్రకారముగాక అధిక కాంతిగలిగినను అప్పటినుంచి నొకసంవ త్సరపర్యంతము జీవించును, మరియు అప్రకారమే బుద్ధికిని క్రొత్తగా అధిక శక్తిగలిగినను లేక అల్పశక్తిగలిగినను అట్టిప్రాణి అది మొదలు ఆరు మాసములు పర్యంతము జీవించును, మరియు చంద్రమండలమందైనను సూర్యబింబమందైనను, తెరప గనబడిన మొదల, యట్టిప్రాణి అది మొద లేడు దినముల పర్యంతము జీవించును, మరియు దేవాలయము మందున్న పుడు మంచి పరిమళముగల పదార్థములు కావలెననెడి తలంపు గలిగిన మొడల అట్టిప్రాణి అదిమొదలు ఆరు దినములు జీవించును. మరియు ముక్కు ప్రాలినను, చెవులు ప్రొుగ్గబడినను, పండ్లు-నల్లగా యుండినను, నేత్రములయందు ఎరుపువన్నె లేకున్నను దేహము మిక్కిలి నలుపుగలి గున్నను మనస్సు భయపడి చెడిపోయినను, అట్టిప్రాణి యతి త్వరితము గా మృతిబొందును. మరియు కారణములేకనే కుడికంటియందు నీరుకా రినను నెత్తియందు చక్కగా పొగలేసినను; అట్టి ప్రాణికి అప్పుడే మర ణము కలుగుచున్నది. ఈ మరణ సూచికములను పూర్వము బ్రహ్మ దేవుడు చెప్పియున్నాడు, గనుక యోగియగువాడు ఈ మరణ సూచిక ములను కనుక్కొని సర్వదా యోగమార్గము నభ్యసింపుచు సాంఖ్య మగు వేదాంత విచార జ్ఞానమును మరువక తన మనస్సును పరమాత్మ యందు జేర్చి కాలమును మ్రింగివేయగలడు. ఈ ప్రకారము కాలమును మ్రింగివేసిన యోగి మృత్యువును గెలిచి, శాశ్వతమైనట్టియు నిశ్చలమై నట్టియు శోభాయమాన స్వరూపమైనట్టియు నాశములేనట్టియు యేవుప ద్రవ మెప్పటికిని కలుగనట్టియు అమృత రూపంబగు మోక్షస్థాన మును పొందగలడు.



శ్రీరస్తు

శ్రీ సద్గురవే నమః

## ౧౧౨—పంచాక్షరీ మంత్రము

నమశ్శివాయ, ఓం, నావడంగ, నమశ్శివాయ, మూరడంగ-నమశ్శివాయ, కోవడంగ-నమశ్శివాయ, కోలడంగ-నమశ్శివాయ ఎన్నకండకత్రాదిగళుం, సకల దృష్టమృగంగళుం, భూతపిశాచిగళుం, ఆవిసిరందు విళన్నక్కువడంగి నర్కశివ.

పంచాక్షరీ యంత్రము




ఈ పంచాక్షరి అయిదు అక్షరములున్ను సద్గురునివలన ఇరువది అయిదక్షరములు పంచే క్రమము తెలుసుకొని పఠింయించుచున్న వారికి సామీప్యపదవి దొరుకును.

## ౧౧౩—నారసింహ్మా మంత్రం

ఓం-భుగభుగ నారసింహ్మా, ఓం-జయజయ నారసింహ్మా, ఓం-పరమయోగానంద నారసింహా, ఓం-పరమపావన నారసింహ్మా. ఓం-భార్గవనారసింహా, ఓం-భయనివారణ నారసింహ్మా, ఓం-హిరణాక్ష్యవధ నారసింహా, ఓం - వరాహా నారసింహా, ఓం - అఘోర నారసింహ్మా, ఓం-ప్రళయ కాలాభీల నారసింహ్మా, ఓం - ప్రహ్లాద నారసింహా, ఓం-లక్ష్మీ నారసింహా, ఓం - భక్తవత్సల నారసింహ్మా, ఓం - లోకపరిపాల నారసింహ్మా, ఓం - యను మీదివ్యనామ సంకీర్తన, యిదియే యందేవున్న, ఆయందే భూత ప్రేత పిశాచ, శాకిని, ఢాకిని, బాలగ్రహాది, క్రూరగ్రహంబులు చాలవెరచు యిది, త్రికర్ణమని సందిడికట్టుకున్నవారికి వ్యాఘ్ర, భల్లూక, వరాహా, సర్ప, వృశ్చికాది, భయంబులు లేవు, బ్రహ్మరాక్షసి మొదలయిన భూతములు పారిపోవును;

రణమందు దారికట్టు మనకట్టు తప్పును, పకడుజూడ పదుగురై కాన వచ్చును. యనేక భయములై యుండును, యంతలేదని ఛేదింపక, అంతఃకరణమందునుంచి హృదయమునందు తగిలించి, ప్రసన్న నారసింహ్మను, పారాయణము చేయుచున్నవారికి ప్రమాణము తప్పదు మా ఆచార్యులు పరుపడిగకాన, హుఁగ్ర నరసింహ్మలాన, నారాయణస్తోత్రం, మంత్ర ఉచ్చాటన, శ్రీమతే రామానుజః.

నారసింహ్మ యంత్రము



ఈ నారసింహ్మయంత్రమును మూడు లేక, అయిదు శనివారములు చేసి ప్రతి పర్యాయము, యేడుమార్లు నారసింహ మంత్రమును పఠియించి, ఆకరు శ్శనివారమునాడు, ముగ్గురు లేక అయిదుగురు సాధువులకు అన్నము పెట్టి సిద్ధి చేసుకోవలయును. అందులో యున్న వన్నిటికిని పనికి వచ్చును. యిది పారాయణ చేసుకొన్న వారికి మోక్షము దొరుకును.

తారకామృతసారము

సంపూర్ణము

---

శ్రీ ఎల్. వి. ప్రెస్, మదరాసు-1—1955

# పుస్తకముల జాబితా

## పద్యకావ్యములు

| | రూ,అ. |
|---|---|
| ఆదిపర్వము పెద్దచ్చు | 1- 8 |
| ఆదిసభాపర్వములు | 4- 0 |
| అరణ్యపర్వములు | 4- 0 |
| విరాటోద్యోగపర్వములు | 4- 0 |
| భీష్మద్రోణపర్వములు | 4- 0 |
| కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 4- 0 |
| శాంతిపర్వము | 4- 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | 4- 0 |
| ఆంధ్రనామసంగ్రహం టీకా తాత్పర్యము | 0-12 |
| ఆంధ్రభాగవతము 2 సం॥ | 15- 0 |

## వచనగ్రంథములు

| | |
|---|---|
| ఆంధ్రవచన భాగవతము ద్వాదశ స్కంధములు ఒకటే సంపుటము | 9- 0 |
| ఆంధ్రవచన భారతము, ఆది సభా పర్వములు | 5- 0 |
| ,, అరణ్యపర్వము | 5- 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 5- 8 |
| ,, భీష్మ, ద్రోణ పర్వములు | 7- 8 |
| ,, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు | 5- 8 |
| ,, శాంతిపర్వము | 7- 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | 7- 8 |
| శబ్దార్థచంద్రిక, శ్రీ మహాకాళి సుబ్బరాయకృత ఆంధ్రనిఘంటువు | 10- 0 |
| ఇండియన్ పీనల్ కోడ్ | 6- 0 |
| క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ క్రొత్త కూర్పు | 7- 8 |
| శుకసప్తతి కథలు | 1- 0 |
| బాలనాగమ్మకథ | 0-12 |
| పెద్ద బొబ్బిలిరాజు కథ | 0-12 |

| | రూ,అ. |
|---|---|
| దేశింగురాజు కథ | 0-12 |
| కన్యకమ్మ కథ | 0-12 |
| భద్రాచల రామదాసు | 0-12 |
| [illegible]రామదాసు | 0- 8 |
| కళింగ యుద్ధము | 0-12 |
| కళింగ[illegible] చరిత్ర | 0-12 |
| కాంభోజరాజు కథ | 0- 4 |
| కామమ్మకథ | 0- 4 |
| లక్ష్మమ్మ కథ | 0- 8 |
| చిన్నమ్మ కథ | 0- 8 |
| [illegible] కథ | 0- 2 |
| గయోపాఖ్యానం జంగంకథ | 0- 6 |
| తెనాలిరామకృష్ణునికథ చిన్నది | 0- 2 |
| తెనాలిరామకృష్ణునికథ పెద్దది | 1- 0 |
| బాలగ్రహదోష చికిత్స | 0- 2 |
| సహదేవప్రశ్న శాస్త్రము | 0- 2 |
| త్యాగరాయకృతులు | 0- 2 |
| కబీరుదాసు కీర్తన | 0- 8 |
| [illegible]దాసు కీర్తన | 0- 2 |
| సక్కుబాయి చరిత్ర | 0- 6 |
| దండకరత్నములు | 0- 6 |
| నలచరిత్ర ద్విపద | 0-12 |
| 6 వ్రతములు | 0- 8 |
| సత్యనారాయణవ్రతం | 0- 5 |
| కేదారేశ్వర వ్రతకల్పము | 0- 2 |
| శ్రీనాగవ్రతకల్పము | 0- 2 |
| అమ్మవారిదండకం | 0- 1 |
| ఆంజనేయదండకం | 0- 1 |
| శ్రీరామదండకం | 0- 1 |
| నామరామాయణం | 0- 1 |
| శ్రీరామనామ మహాత్మ్యం | 0- 2 |
| పోలేరమ్మదండకం | 0- 2 |
| ప్రపంచచిత్రము | 0- 1 |
| గుమాగుమా హాస్యపాటలు | 0- 1 |
| కనకవల్లి పాటలు | 0- 1 |

| | |
|---|---|
| పంచపక్షిశాస్త్రము, కేరళప్రశ్న శాస్త్రము ఉత్తమప్రశ్నము | 1- 0 |
| శకునశాస్త్రము | 0-12 |
| స్త్రీజాతకము | 0-12 |
| యవనజాతకము | 0-12 |
| సర్వార్థచింతామణి | 1- 0 |
| కాళికాశాస్త్రము, తెనుగువచనం | 0- 3 |
| బృహజ్జాతకము, సాంధ్రటీకా తాత్పర్యము | 5- 0 |
| ముహూర్తదర్పణం, సటీక | 2- 0 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | 6- 0 |
| హస్తరేఖా శాస్త్రము | 2- 0 |
| జ్యోతిషబాలశిక్ష | 0- 8 |
| సాముద్రికశాస్త్రము | 0- 8 |
| సకలఅనుగుణ అదృష్టదీపిక | 1- 0 |
| రెట్టమతశాస్త్రం | 0- 8 |
| నవగ్రహచింతామణి | 0- 4 |
| మహామంత్రరహస్యం మర్మశాస్త్రం | 2-8-0 |

## వైద్యగ్రంథము

| | |
|---|---|
| పులిప్పాణి వైద్యము | 2- 0 |
| ఆధునిక మానసిక చికిత్స | 2- 0 |
| ధన్వంతరి నిఘంటువు | 3- 8 |
| మాధవనిదానము ఆంధ్రవ్యాఖ్యానం | 6- 0 |
| నాడీజ్ఞానము ఆంధ్రతాత్పర్యము | 0- 6 |
| వస్తుగుణప్రదర్శిని | 8- 0 |
| సిద్ధమూలికారహస్యము యంత్ర మంత్ర సహితం | 1- 0 |
| బసవరాజీయము ఆంధ్రతాత్పర్యము | 12- 0 |
| వస్తుగుణమహోదధి తెనుగువచనము | 7- 8 |
| వైద్యచింతామణి సాంధ్ర తా॥ 1-2 భా॥ | 16- 0 |
| నూతన అల్లోపతిక్ టానిక్ ప్రాక్టీస్ [illegible] అండ్ [illegible] హోం మెడికల్ గైడ్ | 2- 4 |
| ఆయుర్వేద అండ్ అల్లోపతిక్ ఇంజక్షన్ గైడ్ | 5- 0 |
| వస్తుగుణఫలప్రదీపిక | 6- 0 |
| స్త్రీజనకల్పవల్లి | 4- 6 |
| నూతనవైద్యసారసంగ్రహము | 4- 0 |
| ముఖరోగచికిత్సలు | 2- 8 |
| ఆంగ్లేయ ఔషధయోగములు | 1- 4 |
| యూనానివైద్యామృతం | 0-12 |
| ఆయుర్వేదవైద్యామృతం | 0-12 |
| విషవైద్యం | 0-12 |
| ధన్వంతరివైద్యచికిత్సాసారం | 0-12 |
| ధన్వంతరి | 8- 0 |
| ఆంగ్లేయవైద్యచింతామణి | 6- 0 |
| ఆంగ్లేయ ఔషధగుణదీపిక | 6- 0 |
| శిల్పశాస్త్రం | 0-12 |
| నలభీమపాకశాస్త్రం | 1- 0 |
| మిలిటరీపాకశాస్త్రం | 0-12 |
| రసయోగరత్నాకరము | 1- 0 |
| అగస్త్యతనమూలికామర్మశాస్త్రం | 1- 8 |
| గోసాయిచిటికలు | 0- 8 |
| వైరాగిచిటికలు | 0- 8 |
| సర్బత్ పాకావళి | 0- 8 |
| అనుపానమంజరి | 0- 8 |
| సహదేవ పశువైద్యం | 0- 8 |
| వ్రణచికిత్సలు | 0-12 |
| [illegible] | 0-12 |

## నాటకములు

| | |
|---|---|
| [illegible]చల నాటకము | 0- 8 |
| సారంగధర నాటకము | 0- 4 |
| [illegible] హరిశ్చంద్ర నాటకము | 0-12 |
| సుబ్బాకవి ప్రహ్లాద నాటకము | 0- 8 |
| బుగుడూరు కంసవధ నాటకము | 0- 8 |
| సైంధవ పరాభవ నాటకము | 0- 8 |
| మత్స్యప్రశ్నలు | 0- 4 |
| మైరావణ యక్షగానం | 0- 6 |
| పుల్లిగుంట శశిరేఖనాటకం | 0- 6 |
| పూసపాటి శశిరేఖనాటకం | 0- 8 |
| వెదురుదూరు [illegible] నాటకం | 0- 8 |
| వేములపల్లి విరాటపర్వనాటకం | 0-12 |
| వేములపల్లి ద్రౌపదీకల్యాణనాటకం | 0-12 |
| చిత్రాంగినాటకం | 0-12 |
| చింతగుంటగయోనాటకం | 0- 8 |
| [illegible]రామనాటకం | 0- 8 |
| [illegible] రామనాటకం | 0- 8 |
| ద్రౌపదీవస్త్రాపహరణనాటకం | 0- 8 |

[illegible], [illegible] నెం. 1805 [illegible]-1.

# కాశీ రామేశ్వర మజిలీ కథలు

కాశీరామేశ్వర మజిలీ కథలను పఠించి వినని వారుండరు. ప్రస్తుతములో ఈ గ్రంథము విశేష ప్రచారమునందున్నది.

పూర్వకాలంబున బ్రహ్మానందయోగి యను ఒక యోగిపుంగవుడు కాశీకి పోవుచు తన వెంటనంటికూడా వచ్చుచున్న శిష్యులకు మార్గాయాసంబు పోగొట్టుటకై తెలిపిన కథలును, కాశీరామేశ్వర యాత్రలో వేయబడిన మజిలీలలో శిష్యులకు కనబడిన విచిత్రముల విషయములను తెలిపిన కథలే కాశీరామేశ్వర కథలనబడును.

కథలు చదువుచున్నప్పుడు నిజముగ యిట్టి విషయములు పూర్వము భూలోకమున జరిగియే యుండునని తోచకమానదు. ఇందలి భాషాశైలి ద్రాక్షాపాకమును బోలియున్నది. హాస్యరసములైన విషయములు, విచిత్రములగు సంఘటనలు, ఆశ్చర్యకరమును కలిగించు కథలు, కడుపుబ్బ నవ్వు పుట్టించు చిత్రవిచిత్రములు, చదువవలయునే గాని వ్రాయనలవిగాదు. ఈ గ్రంథమును వ్రాసినకవి తనకుగల భాషాజ్ఞానమును, లోకానుభవమును యిమిడ్చి వ్రాసియుండెను. ఒక కథ చదివిన వెంటనే రెండవకథ చదువవలయునని కోరిక తరంగములవలె ఉప్పొంగుచుండెను. ఆంధ్రభాషలో యిట్టి గ్రంథము లేదు. ఇది ప్రతివారును, ముఖ్యముగ చదివి ఆనందించవలసిన ఒక ఉత్తమపుస్తకము. ఇందు విశేష సంతోషమును కలుగజేయు కథలు అనేకములు గలవు.

812 పేజీలు, చక్కని తెల్లరకము కాగితము — రు. 2-0-0

# శ్రీ భక్త విజయము

ఇందు మహాపతివ్రతల కథలు హృదయమధురముగ వ్రాయబడియుండెను. ఇట్టి మహాపతివ్రతల కథలు చదువుటవలన దుష్ప్రవర్తనులైనవారు కూడ తమ తమ చెడ్డ ప్రవర్తనలను వదలి ధర్మమార్గముల ననుసరించి సంచరింతురని చెప్పుటకు ఎట్టి సందేహమును లేదు.

మహా నిశ్చలభక్తురాండ్రైన పతివ్రతల కథలు చదువ జదువ శరీరము భక్తితో తన్మయత్వము జెంది పులకాంకురితమగుచుండును. ఈ గ్రంథము నిజముగ భక్తులపాలిటి కల్పతరువువంటిది. దైవము లేదని వాదించువారుకూడ యీ కథలు చదివినంతమాత్రముననే తమ అభిప్రాయములను మార్చుకొని భక్తుల ప్రభావములను తలంచుకొనుచు ఆశ్చర్యమును జెందుచుందురు. ఈ గ్రంథము భక్తుల హృదయములు రంజింపజేయు ననుటలో ఎట్టి సందేహమును లేదు. గ్రంథముయొక్క పేరును బట్టియే గ్రంథమునందలి విశేషములను తెలుసుకొనవచ్చును. భక్తుల ప్రభావములు ఈగ్రంథములో విపులముగ తెలుపబడియుండెను.

భక్తిరసమును కురిపించు విషయములు, ఆనందమును కలిగించు చక్కని శైలిగల వ్రాతలు, ఆశ్చర్యమును కలిగించు చక్కని శైలిగల వ్రాతలు, ఆశ్చర్యకరములైన ఘట్టములు—చదువువారి హృదయములకు ఆహ్లాదమును కలిగించును భక్తిలేని జీవితము నిరర్థకము. భక్తిని వృద్ధిపరచుకొనుటకు యిట్టి గ్రంథములే ఆధారములు. నిజముగ ఈ గ్రంథము భక్తులపాలిటి రత్నమువంటిది. శ్రీభక్తవిజయమను యీ గ్రంథమునకు సాటియైన గ్రంథము వేరొకటిలేదు. మహాచక్కని విషయములు.

ప్రతివారును ముఖ్యముగ చదువవలసిన గ్రంథము. — రు. 1-8-0

సి. వి. కృష్ణా బుక్కు డిపో, వరాహాలుచెట్టి వీధి నెం. 180, మదరాసు-1


శ్రీ పోతులూరి
వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర